శ్లో॥ దివ్యమంత్రక్రియా యుక్తం । పురా నారాయణేరితం ।

శ్లో॥ తత్పాంచరాత్రం శృతి మూలభూతమ్ ।
స్మృత్యర్థ విస్తార సుబోధ కందమ్ ।
అపౌరుషేయం హరిభక్తి బీజమ్ ।
పరం పదప్రాప్తి సుఖైక దక్షమ్ । (సంహితాంతరే)

శ్లో॥ వాకో వాక్యమే కాయనమ్
దేవవిద్యాం బ్రహ్మవిద్యామ్ । (ఛాందోగ్యోపనిషత్)

శ్లో॥ శృణుధ్వంమునయస్సర్వే వేద మేకాయ నాఽభిదం;
పాంచరాత్రమ్ -మూలవేదం సాత్వతమ్ - తంత్ర మిత్యపి ।
భగవచ్ఛాస్త్రమితి తన్నామభిః పరిపఠ్యతే ।
మోక్షాయనాయ వై పంథా ఏతదన్యో నవిద్యతే ।
తస్మాదేకాయనం వేతి ప్రవదన్తి మనీషిణః ।
ఆచారకథనా ద్దివ్యగతిప్రాప్తి విధానతః ।
మహాత్మ్యం తత్త్వకథనా దాగమశ్చేతి గణ్యతే ।
మహతోవేద వృక్షస్య మూలభూతో మహాఽనయం ।
ఋగాద్యా స్కంధభూతా స్తేశాఖాభూతాశ్చ యోగినః ।
జగన్మూలస్య వేదస్య వాసుదేవస్య ముఖ్యతః ।
ప్రతిపాదకతా సిద్ధ మూలవేదాఖ్యతా ద్విజాః
సత్వస్వరూప హరిణా ప్రోక్తత్వా త్సాత్వతం మతం ।
తనోతి విపులానర్థాన్ తత్త్వమన్త్ర స్స మాశ్రితాన్ ।
త్రాణంచకురుతే యస్మా త్తంత్రమి త్యభి ధీయతే ।
పాంచరాత్రంతు సర్వేషామ్ శాస్త్రాణామ్ మూలకారణమ్ । (కపింజలే)

శ్లో॥ శృతి - స్మృతి - పురాణాది పాంచరాత్ర విధిమ్ వినా ।
ఐకాన్తికీ హరే ర్భక్తి రుత్పాతా యైవ కల్పతే ॥

శ్లో॥ శ్రౌతమ్ వైఖానసం ప్రోక్తం వాసిష్ఠం స్మార్తముచ్యతే ।
పాంచరాత్రాదిదమ్ శాస్త్రం దివ్యాగమ మితీరితం । (పద్మపురాణే)

E.N.
17/11/17

ఓమ్ నమో భగవతే వాసుదేవాయః




## * శ్రీ వైంకురనాధ స్తవమ్ *

శ్లో॥ సవ్యమ్ పాదమ్ ప్రసార్య శ్రితదురితహరమ్ దక్షిణమ్ కుంచయిత్వా ।
జానున్యాదాయ సవ్యేతర మితరభుజమ్ నాగభోగేనిధాయ ।
పశ్చాద్బాహుద్వయేన ప్రతిభటశమనే ధారయన్ శంఖ చక్రే ।
దేవీభూషాఽది జుష్టో జనయతి జగతామ్ శర్మ వైకుంఠనాధః ।

ప్ర : **పాంచరాత్రము అనగానేమి ?**

స : పాంచరాత్రము అనగా శ్రీ ప్రశ్న సంహితలో నిట్లున్నది.

శ్లో॥ రాత్రి రజ్ఞాన మిత్యుక్తం పంచే త్యజ్ఞాన నాశనమ్ ।
తచ్ఛాస్త్రం పంచరాత్రమ్ స్యాత్ అన్వర్థ స్యాఽను రోధతః ।

తా॥ అజ్ఞానమును నశింపజేయునది పాంచరాత్ర మనబడుచున్నది.

ప్ర : **ఆగమము అననేమి ?**

స : ఆగమము అనుదాని వివరణము **శబ్ద స్తోమ మహానిధిలో** ఈ విధముగా నున్నది

శ్లో॥ ఆగతం శివ వక్త్రేభ్యో గతంచ గిరిజాశ్రుతౌ ।
మతంచ వాసుదేవస్య తస్మా దాఽగమ ముచ్యతే ।

తా॥ వాసుదేవునిగూర్చి పార్వతికి శివుడు చెప్పిన దానికి ఆగమమని పేరు.

ప్ర : **భగవంతుడన నెవరు ?**

స : దీనికి సమాధానము **వామన** సంహితలో నిట్లున్నది.

శ్లో॥ జ్ఞాన-శక్తి-బలైశ్వర్య-వీర్య-తేజాంసి షడ్గుణాః ।
షణ్ణామ్గుణానామ్ నివహో భగ ఇత్యభిధీయతే ।

తా॥ జ్ఞానము-శక్తి-బలము-ఐశ్వర్యము-వీర్యము-తేజస్సు అను ఈ ఆరు గుణములు భగము అనబడును. షడ్గుణ పరిపూర్ణుడైనవాడే భగవంతుడు.

ప్ర : ఆరాధనము అనగానేమి ?

స : మనస్సు-వాక్కు-దేహము-చేతలు వీటి అన్నిటి చేతను భగవంతుని పూజించుట-స్మరించుట మున్నగు పనులు ఆరాధనము అనబడును.

**ప్ర : భగవదారాధనము వలన ప్రయోజనము ఏమి ?**

**స : పాద్మ సంహిత యందు మూడవ అధ్యాయములో ఇట్లు కలదు.**

శ్రీ భగవాన్; శ్లో॥ శ్రూయతామ్ అభిదాస్యామి-బ్రహ్మన్నారాధనం హరేః ।
యేన విష్ణోః పదం మర్త్యాః-ప్రాప్నో త్యమర దుర్లభమ్ ।

తా॥ శ్రీమన్నారాయణుడు బ్రహ్మతో నిట్లు చెప్పెను. దేవతలకుగూడ దొఱకనటువంటి విష్ణులోకము మానవులకు నాఆరాధనము చేసినంత మాత్రముననే దొఱకు చున్నది.

## * ఆరాధన భేదములు *

శ్లో॥ ఉత్సవాఽవసితమ్ శ్రేష్ఠమారాధన ముదీరితమ్ ।
హోమాన్తమ్ మధ్యమమ్ ప్రోక్తమ్; ప్రాపణాన్త మధాఽధమమ్ ।
క్షుద్రమ్ ధూప-దీపాన్త మధమాఽరాధనమ్ భవేత్ । **(పాద్మసంహితా)**

తా॥ నిత్యోత్సవముతో చేయు ఆరాధనము శ్రేష్ఠము; హోమముతో పూర్తి చేయునది మధ్యమము; ప్రాపణముతో ముగించునది అధమము; ధూప, దీపములతో నెరవేర్చునది క్షుద్రము । అధమాధమము అని 4 విధముల ఆరాధనలు చెప్పబడినవి

**ప్ర : ఆచార్యుడు అనగా నెవ్వరు ?**

**స : పాద్మ సంహిత క్రియా పాదములో నిట్లున్నది.**

శ్లో॥ అదౌతు బ్రహ్మణో విద్వాన్ పంచరాత్ర పరాయణః ।
ఆచార్యమ్ వరయేత్ పూర్వం తదధీనాహి సిద్ధయః ।

తా॥ భగవదాలయమును నిర్మించు యజమాని మొట్టమొదట పాంచరాత్ర అర్చనా విధానము బాగుగా తెలిసిన వారిని ఆచార్యునిగా నియమించవలెను : అటువంటి



ఆచార్యుని యందు సకల సిద్ధులును ఉండును. పాంచరాత్ర విధానము చక్కగా తెలిసినవాడే ఆచార్యుడు.

**ప్ర : కాలకృత్యములు అననేమి ?**

స : **అనంతాఖ్య** సంహితలో ఇట్లున్నది.

శ్లో॥ స్నానాఽచమన శౌచేన ప్రాణాయామేన దేశికః ।
అంతర్బహిశ్శరీరస్య సాధకస్య విశుద్ధ్యతి ।
స్నాన మూలక్రియా స్సర్వాః ఫలసంసిద్ధి హేతవః ।
తస్మాత్ స్నానం ప్రకుర్వీత దేవర్షి పితృ తర్పణే ।

తా॥ స్నానము-ఆచమనము-శౌచము-ప్రాణాయామము, మొదలయినవాటి వలన అర్చకుడు లోపల-వెలుపల పరిశుద్ధుడగును; స్నానము మొదలయిన వాని వలన శుభ ఫలితములు కలుగును. అందుచే దేవ-ఋషి-పితృ తర్పణములు విడుచుటకు మునుపు తప్పక స్నానముచేసి పరిశుద్ధుడు కావలెను.

**ప్ర : అర్చకుడు దేవాలయమును చేరి ఏమి చేయవలెను ?**

**కపింజలము; శ్రీ ప్రశ్నము అను సంహితలలో ఇట్లున్నది.**

శ్లో॥ పాదప్రక్షాళనం కృత్వా ఆచమ్యచ జితేంద్రియః ।
గేహం ప్రదక్షిణీ కృత్యా ద్వార పార్శ్వం సమాచరేత్ ।

శ్లో॥ ప్రక్షాళ్యపాణి పాదంచ గోపురస్య బహిస్థలే ।
ఆచమ్యాఽంత ర్మహాపీఠం ప్రాదక్షిణ్యేన వై తతః ।

తా॥ కాలు-చేతులు కడిగికొని ఆచమనముచేసి పాద గోపురమును దాటి లోనికి ప్రవేశించవలెను : తరువాత ఆలయ ప్రదక్షిణము (నాలుగు మారులు) చేయవలెను.

**ప్ర : సాష్టాంగము అనగా నేమి ?**

**స : పాద్మసంహిత యందీ విధమున నున్నది.**

శ్లో॥ పద్భ్యామ్-కరాభ్యామ్-జానుభ్యా మురసా-శిరసా-దృశా
మనసా-వచసాచైవ ప్రణమోఽష్టాంగ ఉచ్యతే ।

తా॥ పాదములు-చేతులు-మోకాళ్ళు-ఎదురు రొమ్ము-తల-చూపు-మనసు-మాట ఎనిమిదింటి చేతను భగవానునకు దాసోఽహ మొనర్చుటయే సాష్టాంగము :

మహా జయజయాఽరావైః పునః పునరుదీరితైః ।
ప్రబోధలక్షణై స్తోత్రైః ఉత్థాప్య శయనా త్తతః ।

తా॥ సూర్యోదయమునకు పూర్వమే వంది మాగధులు మొదలయినవారు స్తోత్రములతో, అనేక విధములగు వాద్యవాదనములతో, శంఖము, నగారా, కొమ్ము బూరల మ్రోతలతో । జయవాసుదేవా ! జయ భక్త సంరక్షకా । అను స్తుతులతో మరల మరల కీర్తించుచూ శ్రీ భగవానుని నిద్రనుండి మేల్కొల్పవలెను
"ఉత్తిష్ఠ బ్రహ్మణస్పతే" అను మంత్రములతో పాటు

శ్లో॥ కౌసల్యాసుప్రజారామ ! పూర్వాసంధ్యా ప్రవర్తతే ।
ఉత్తిష్ఠ నరశార్దూల ! కర్తవ్యమ్‌దైవ మాఽహ్నికమ్ ।

శ్లో॥ ఉత్తిష్ఠోత్తిష్ఠ గోవిన్ద ! ఉత్తిష్ఠ గరుడధ్వజ !
ఉత్తిష్ఠ ! కమలాకాన్త ! త్రైలోక్యమ్ మఙ్గళమ్ కురు ।

అను ఈ ౨శ్లోకములను గూడ పఠించవలెను.

ప్ర ॥ నిర్మాల్యము అనగానేమి ? దాని నేమి చేయవలెను ?

స ॥ శాండిల్య సంహిత యందిట్లున్నది.

శ్లో॥ నభారమ్ మేరు శిఖరమ్ నభారమ్ సప్త సాగరాన్ ।
రాత్రౌ పూజిత నిర్మాల్యం ప్రభాతే భార ముద్ధృతమ్ ।
అహోరాత్రంతు నిర్మాల్యమ్ ప్రాతః కాలే విసర్జయేత్ ।

తా॥ భగవానునకు రాత్రి అర్పించిన పూలు-తులసి; చందనము మొదలయిన వానికి నిర్మాల్యమని పేరు. రాత్రి అర్పించినవానిని మరునాటి ఉదయముననే తీసివేయవలెను ; లేకున్న మేరు శిఖరము - సప్త సముద్రములు మానవునకు ఎంత బరువో-రాత్రి అర్పించినవి తెల్లవారు నప్పటి స్వామికి అంత బరువగును.

ప్ర ॥ నిర్మాల్యము నెచట నుంచవలెను ?

స ॥ అనంతాఖ్య సంహిత యందిట్లున్నది-

శ్లో॥ దీపాన్ సందీపయిత్వాతు నిర్మాల్య మపకృష్యచ ।
విష్వక్సేనాయ దత్వాతు ......... [illegible]



తా॥ నిర్మాల్యమును తీసివైచి విష్వక్సేనునకు అలంకరింప వలెను (తరువాత భక్తులకు యివ్వవలయును.)

ప్ర ॥ పంచశుద్ధులు అనగానేమి ?

స ॥ శ్రీప్రశ్న సంహితలో నిట్లున్నది-

శ్లో॥ పూజాకాలే పురా కుర్యాత్ పంచశుద్ధిమ్ (గురూత్తమ)
స్థాన శుద్ధిమ్‌పాత్రశుద్ధిమ్-బింబశోధన మేవచ ।
ఆత్మనో భూత శుద్ధిమ్‌చ । [illegible]

తా॥ పూజ చేయునపుడు ముందుగా ఐదు విధములగు శుద్ధులను చేయవలెను.

౧ స్థాన శుద్ధి - అనగా చిమ్ముట, నీరు చల్లుట మొ॥

౨ పాత్రశుద్ధి - పంచపాత్రలు, తీర్థపుబిందె, పతత్‌గ్రహ పాత్ర, ధూప-దీప-గంధ-నివేదన - అర్ఘ్య - పాత్రలు తోముట

౩ బింబశుద్ధి ॥ కర్మ - ఉత్సవ - బలి - యాగ - తీర్థ-శయన బింబములను (విగ్రహములను) శుభ్రపఱచుకొనుట

౪ ఆత్మశుద్ధి ॥ "ఓమ్‌నమో భగవతే వాసుదేవాయ । అను ద్వాదశాక్షరిని జపించిన ఆత్మశుద్ధి కలుగును ॥

౫ భూతశుద్ధి ॥ భూమి, నీరు, వెలుతురు, గాలి, ఆకాశము. ఇవి ఐదు భూత పంచకము, వీని శుద్ధి.

## ✻ భూతశుద్ధి క్రమమ్ ✻

దేహము ఈ పంచ భూతములతో జేయబడినది, మూత్ర పురీషములకు అశ్లీల వాక్కులకు నిలయమైన ఈ దేహమును ఓమ్ యం అను వాయు బీజముతో శోషింపజేసికొని, మనస్సును పద్మాకారముగ తలచి "ఓం రం" అను అగ్ని బీజమును నెత్తురువన్నె కలిగి ముక్కోణపు ఆకారముగనున్న దానిని తలచి అర్చకుడు తన దేహమాలిన్యము - పాపము; ఆ మంటలలో కాలి బూడిదయైనట్లు భావించి "ఓం లం" అను మహేంద్ర బీజమును స్మరించి గాలిని స్తంభింపచేసి "ఓమ్ వం" అను వరుణ బీజమును తలచి భగవద్ధ్యానము చేయుచు దానియందు పుట్టిన అమృత జలమున శిరస్సునుండి పాదముల వఱకు శరీరము శుద్ధియైనట్లు భావించవలెను.

ప్ర : మూలబింబమును, తక్కిన బింబములను ఎట్లు శుభ్రము చేయవలెను.

స : మూల బింబమును ఉసిరి ఆకులతో కట్టిన కుంచెతోగానీ, నెమలి పింఛముల కట్టతో గానీ, తెల్లని-మెత్తని వస్త్రముతోగానీ తుడువ వలయును.

ప్ర : బేరములు ఎన్ని ? వాని నెట్లు శుభ్రపరచవలెను ?

స : పద్మసంహితలో నిట్లున్నది.

శ్లో॥ కర్మార్చాచోఽత్సవార్చాచ బల్యర్చా తథైవచ।
స్నాన తీర్థోఽభయార్చాచ స్వాపోత్థానార్చయాసహ।

శ్లో॥ ప్రతిమాషడ్విధాతవ్యా పూజాయా ముత్తమా భవేత్।

తా॥ కర్మ-ఉత్సవ-బలి-స్నాన-తీర్థ-శయన బేరములు( ౬ విధములు) పూజించుటకు ఉత్తమమైనవి వీనిని చింతపండు పులుసు పట్టించి, గడ్డికాల్చిన బూడిదతో తోమి కడిగి శుద్ధి చేయవలెను "పురుష సూక్తము"తో స్నానము చేయింపవలెను.

ప్ర : పాత్రలకు అధిదైవతము లెవరు ?

స : పద్మ సంహిత చర్యా పాదమున నిట్లున్నది.

శ్లో॥ శ్రీరర్ఘ్యస్య భవేద్దేవీ వాగీశా ఽచమనీయకే।
పాద్యస్య పితరోదేవాః స్నానీయే వరుణ స్తథా।
శుద్ధోదకస్యశాంతిస్స్యాత్ పాత్రేష్వేతాన్సమర్చయేత్

తా॥ అర్ఘ్యపాత్రకు శ్రీదేవి - పాద్యపాత్రకు పితృదేవతలు - అచమన పాత్రకు పార్వతి - స్నానపాత్రకు వరుణ దేవుడు - శుద్ధోదక పాత్రకు శాంతి అధిదైవతములు. వీరిని అర్చింపవలెను.

ప్ర : పంచపాత్రలను ఏమంత్రముతో అభిమంత్రించవలయును ?

స : విష్ణుగాయత్రితో అభిమంత్రించవలెను.

శ్లో॥ ఓమ్ నారాయణాయ విద్మహే
వాసుదేవాయ ధీమహి
తన్నోవిష్ణుః ప్రచోదయాత్ ఇది విష్ణుగాయత్రి



ప్ర : పంచపాత్రలు ఏ-యే దిక్కులయందుంచవలెను ?

స : వాసిష్ఠ సంహిత యందిట్లున్నది.

శ్లో॥ ఆగ్నేయాదిషు కోణేషు పాద్యాఽర్ఘ్యాఽచమనీయకం।
స్నానీయపాత్ర మైశాన్యాం సర్వార్థం మధ్యతోన్యసేత్।

తా॥ ఆగ్నేయమున పాద్యము ! నిర్ఋతియందు అర్ఘ్యము ! వాయవ్యమున ఆచమనీయము - ఈశాన్యమున స్నానీయ పాత్ర ఉంచవలెను. మధ్యన శుద్ధ జలపాత్ర ఉంచవలెను. ("దేవప్రాచీ" అనగా దేవుని ముఖము ఏ దిక్కున వున్నను తూర్పుగా భావించి పాత్రలను ఏర్పరచవలెను.)

ప్ర : ఏ యే పాత్రలయందు ఏ యే ద్రవ్యములుంచవలెను ?

స : పాద్మ సంహిత చర్యాపాదమున నిట్లు చెప్పబడివున్నది.

శ్లో॥ కుశాగ్రమక్షతమ్ పుష్పమ్ ఫలమ్ మలయజమ్ తథా।
తిలాన్ సిద్ధార్థ సహితాన్ యవాన్ అర్ఘ్యస్యభాజనే।

తా॥ అర్ఘ్యపాత్రలో దర్భచివరలు- అక్షతలు-పూలు-చందనము-నూవులు- తెల్ల ఆవాలు-యవలు ఉంచవలెను.

శ్లో॥ తిలాన్, దూర్వాన్, విష్ణువర్ణీమ్ శ్యామాకమ్ పద్మమక్షతమ్।
పాద్యపాత్రే షడేతాని ద్రవ్యాని వినివేశయేత్।

తా॥ పాద్యపాత్రలో నువ్వులు-గరిక-విష్ణుక్రాంత ఆకులు,శ్యామాకము-పద్మములు-అక్షతలు ఈ ౬ ద్రవ్యములును ఉంచవలెను.

శ్లో॥ ఏలా-లవంగ కర్పూరమ్ జాతీ తక్కోల చన్దనమ్।
పుష్పాణ్యాచమనీయేతు పాత్రేద్రవ్యాణి కల్పయేత్।

తా॥ ఆచమన పాత్రలో ఏలకకాయలు, లవంగములు - పచ్చ కర్పూరము - జాజికాయ - తక్కోలములు - చన్దనము - సుగంధ పుష్పములు - ఈ ద్రవ్యములు ఉంచవలెను.

శ్లో॥ గన్ధం, * సర్వౌషధీ, రత్న, ఫల,బీజ, కుశాని చ।
తిలాని చాఽక్షతం చైవ దధి, క్షీర, ఘృతానిచ।
రజనీ ద్వాద శాంగాని స్నానీయే చ వినిక్షిపేత్।

తా॥ చందనము - ✱ సర్వౌషధి - రత్నములు - పండ్లు, విత్తులు - దర్భలు (చివరలు) నువ్వులు - అక్షతలు - పెరుగు - పాలు - నేయి (ఆవుది) పసుపు ఈ ౧౨ ను స్నాన ద్రవ్యములు.

✱ పైన సర్వౌషధి అనునది చెప్పబడినది : అవి చంగల్వ కోష్ఠ-జటామాంసి-దుంప పసుపు-మ్రాను పసుపు-పద్మములు-వస-కర్పూరము-తుంగముస్తలు ఈ ౮ యును సర్వౌషధి అనుపేరు గలవి. కనుక స్నాన పాత్రలో వీనిలో ఏ ఒక దానినైనను సర్వౌషధికి బదులుగా వాడవచ్చును.

శ్లో॥ తిలాని తులసీ చైవ నిక్షిపే చ్ఛాన్తి వారిణే।

తా॥ నువ్వులు-తులసి (దళములు) ఈ రెండు ద్రవ్యములు మధ్యనవుండు శుద్ధ జల పాత్రలో నుంచవలెను.

ఈ శుద్ధ జలపాత్రలోని నీరు ఆలయములో అపవిత్రము జరిగినదను కొనిన చోటులయందు చల్లుకొనిన పరిశుద్ధ మగును. పూజాసమయమున అస్త్ర మంత్రమును పఠించుచు పూజా ద్రవ్యములపైనను, అర్చకుని శిరస్సునను, ప్రోక్షించు కొనవలెను.

ప్ర : ఏ యే విగ్రహములను ఎవరెవరు అర్చింపవలెను ?

స : మూలబింబమును అర్చకుడును, తక్కిన దేవీ-భక్తబింబములను పరిచారకుడు గాని, ప్రధానార్చకుని శిష్యులుగానీ అర్చింపవలెను.

## ✱ పరివారార్చనము ✱

ప్ర : ఏ యే దిశల ద్వారములయందు ద్వారపాలకులెవరెవరుండిరి ?

శ్లో॥ చండ ప్రచండౌ ప్రాగ్ద్వారే యామ్యే భద్ర సుభద్రకౌ।
పశ్చిమే జయ విజయాంశ్చ సౌమ్యే ధాతృ విధాతృకౌ।

తా॥ తూర్పువాకిట చండ; ప్రచండులు; దక్షిణమున భద్ర-సుభద్రులు; పడమరన జయ-విజయులు; ఉత్తరమున ధాతృ-విధాతృలు ద్వారపాలకులు కలరు.

ధ్వజస్థంభమున గరుత్మంతుడు; బలిపీఠమున ఆమోద-ప్రమోదులు; రాజ గోపుర ద్వారమున కుడివైపున సూర్యుడు-ఎడమవైపు చంద్రుడు ఉందురు.



**ధామవు మాత్సలి భావనా—అనగా భగవదాలయమునంతటినీ భగవంతునిగా భావించి, అర్చకులు; భక్తులు—యజమానులు ప్రవర్తి విస్మలై వుండవలెను.**

ప్ర : అర్చక స్వామి ఎట్లుండవలెను ?

స : పారమేశ్వర; శ్రీ ప్రశ్న సంహితల యందిట్లున్నది-

శ్లో॥ ఆత్మానమ్ వస్త్ర యుగ్మేన కుండలాది విభూషణైః।
శ్వేత మృత్స్నోర్ధ్వ పుండ్రైశ్చ చందనాద్యై స్సుగంధభిః।
హేమోఽపవీతై స్స్రగ్భిశ్చ భూషయే ద్దేశికోత్తమః।
ముఖవాస సమోపేతై స్తాంబూలై శ్శోధయేన్ముఖమ్।

తా॥ ఒకవస్త్రము కట్టుకొని, వేరొకటిపైన వేసికొని, మకరకుండలములు మొదలయిన భూషణములు ధరించి ఊర్ధ్వ పుండ్రములు-మంచి చందనపు లేపనము : బంగరు యజ్ఞోపవీతము-నోరు సుగంధము వచ్చునట్లు పచ్చ కర్పూరము ఏలకకాయలు-లవంగములు-జాజికాయ మొదలగునవి కలిపిన తాంబూలము సేవించి (ప్రసన్నుడై-సన్నని తెల్లని వస్త్రములు ధరించి, చక్కగ దువ్వుకొని వెంద్రుకలు ముడివేసికొని) అర్చకుడు ఉండవలెను.

ప్ర : అర్చకుడు భోజనముచేసిన తరువాత అర్చింపవచ్చునా ?

స : విహగేంద్ర సంహితలో నిట్లున్నది.

శ్లో॥ అభుక్త్వాపి భుక్త్వా ఽవా కృతకృత్యశ్చ దేశికః।

ఆకలికి తాళలేనివారు అర్చన కాలము మించు సమయమున, భుజించికానీ, భుజింపకకానీ అర్చింపవచ్చును. (మనసు భగవానుని యందు తప్పక నిల్ప వలెను)

ప్ర : పవిత్రము నెప్పుడెప్పుడు ధరింపవలెను ?

స : పారమేశ్వర సంహితలో నిట్లున్నది.

శ్లో॥ అర్చనం - జప, హోమంచ, దానంచ - పితృతర్పణమ్।
అపవిత్రాను పాణించ తత్ సర్వంచ వినశ్యతి।
తస్మాత్ సర్వప్రయత్నేన సదా ధార్యమ్ పవిత్రకమ్।

తా॥ భగవదర్చన చేయునపుడు - జపము, హోమము, దానము, పితృదేవతలకు (తిల) తర్పణము చేయునపుడును - అపవిత్ర హస్తములతో ఇవ్వరాదు. అటులిచ్చిన ఫలితమంతయు నశించును కనుక రెండుచేతుల యందునుగల నాలుగవ వ్రేళ్లయందు పవిత్రములను ధరించమని పరమేశ్వర సంహిత చెప్పు చున్నది :

ప్ర : **పవిత్రమున కెన్ని దర్భలుండవలెను ?**

స : విష్ణుతిలక సంహిత తృతీయాధ్యాయమున ఇటులగలదు.

శ్లో॥ పవిత్ర మేకదర్భేణ ప్రేత కర్మణి కారయేత్
నిత్యకర్మణి దర్భాభ్యాం ద్వాభ్యామేవ (చతుర్ముఖ)

తా॥ పితృకర్మలయందు ఒక దర్భతోను, నిత్యము చేయుపనులయందు రెండు దర్భలతోను, పవిత్రమును ధరింపవలెను. ఇంకను చంద్రికయను గ్రంధములో నిట్లున్నది.

చంద్రికాయామ్ -

శ్లో॥ త్రిభిః దర్భైః శాంతికర్మ ; పంచభిః పౌష్ఠికంతథా ।
చతుర్భిశ్చాభిచారన్తు కుర్వన్; కుర్యాత్పవిత్రకమ్ ।
దేవకార్యే త్రిభిర్దర్భై; రేకేన పితృకర్మణి ।
ద్వాభ్యాం మనుష్యకార్యేతు పవిత్రం కారయే ద్బుధః ।

ఒక దర్భతో పితృకర్మ ; రెంటితో మనుష్యకార్యములు; మూడింటితో దైవ కార్య-శాంతి కర్మలు; నాలుగింటితో అభిచార హోమములు (ఇతరులకు కీడు చేయునవి.) పుష్టిని చేకూర్చు కర్మలకు ఐదు దర్భలు కలిగిన పవిత్రములను ధరింపవలెను.

ప్ర : **భగవంతుని అర్చించునపుడు అర్చకుడెచట కూర్చుండవలెను ?**

స : ఈశ్వర సంహిత యందిట్లున్నది.

శ్లో॥ దేవస్యాగ్రతో వాపి దక్షిణం భాగ మాశ్రయేత్ ।
ఈశ్వరః ప్రాగ్వశాదేవ-హ్యుత్తరాభి ముఖోద్విజః ।



తా॥ దేవునిముందు భాగమున దక్షిణపు వైపున అర్చకుడు పద్మాసనమున ఉత్తరాభిముఖుడయి కూర్చొనవలెను.( ఎదురుగా కూర్చొని పూజింపరాదు)

ప్ర : **అర్చన చేయునపుడు తెఱను ఎందులకు వేయవలెను.**

స : పాద్మ సంహిత యోగపాద ప్రధమాధ్యాయమున నిట్లున్నది.

శ్లో॥ ప్రచ్ఛన్నపటసంయుక్తం యథాకాలం ప్రపూజయేత్ ।
పాపరోగ - మతిభ్రష్టాన్ - నాస్తికాన్ - శృతిదూషకాన్ ।
వేద విక్రయకాన్ - వాఽపి. పాంచరాత్రస్య దూషకాన్ ।
కృతఘ్నాన్ - పతితాన్ - శ్చైవ విష్ణు నిందాపరాన్ స్తథా ।
గురునిందా పరాన్శ్చాపి - పాషండ సమయస్థితాన్ ।
అంధ -పంగూ హ్యపస్మార పాపరోగాపదేశినః ।
మూకాంశ్చ బధిరాన్ శ్చైవ పూజాకాలే, న దర్శయేత్ ।

శ్లో॥ పూజాకాలేతు, దేవానాం పుష్ప ఽలంకరణే తథా ।
ముద్రా దర్శన కాలేచ, హేమ,-రత్న సమర్పణే ।
ఏవ మేతేషు కాలేషు పట మాచ్ఛాద్య వాససా ।

తా॥ పూజ చేయునపుడు తెఱ (తప్పక) వేయవలెను. ఎందులకనగా? కుష్ఠరోగము గలవారు, పిచ్చివారు-దేవుడు లేడనువారు, వేదములను తిట్టువారు, వేద విద్యలను అమ్ముకొనువారు, పాంచరాత్ర ఆగమ విధులను తిట్టువారు, చేసిన మేలును మఱచినవారు, చెడు పనులను చేసినవారు - విష్ణు నింద చేయువారు, గురునింద చేయువారు) చార్వాక (జైన-బౌద్ధ) మతమువారు-గ్రుడ్డివారు; కుంటివారు; మూర్ఛ క్షయ, మొదలయిన వ్యాధులు కలవారు; మూగవారు, చెవిటివారు మొదలయిన వారు పూజ చేయునపుడు చూడరాదు.

పూజ చేయునపుడు; పుష్పాలంకారము చేయునపుడును, (శంఖ-చక్ర-గరుడ మొదలయిన) ముద్రలను భగవంతునకు చూపించునపుడును, బంగారు, రత్నహారములు, నగలు సమర్పించునపుడును, మొదలయిన సమయములందు గుడ్డతెఱను వేయవలెను.

ప్ర : షోడశోపచారము అననేమి ?

స : పదునారు (౧౬) ఉపచారములు-పాద్మసంహిత యందిటుల గలదు.

శ్లో॥ ఆద్యయావాహయేద్దేవ మాసనంచ ద్వితీయయా ।
పాద్యం తృతీయయా, చార్ఘ్యంచతుర్థే వితరేద్బుధా ।
పంచమ్యాచమనం, స్నానం షష్ఠ్యా, సప్త ఋచామ్బరమ్ ।
ఉపవీత మృచాష్టమ్యా; నవమ్యా గంధలేపనమ్ ।
పుష్పం దశ మ్యై కాదశ్యా - ద్వాదశ్యా ధూప దీపకౌ ।
నివేదనం త్రయోదశ్యా, చతుర్దశ్యా నమస్కృతిః ।
ప్రదక్షిణం పంచదశ్యా, షోడశోద్వాసనం హరేః ।

**పురుష సూక్తమునందలి ౧౬ ఋక్కులతో పదునారు ఉపచారములు భక్తి -శ్రద్ధలతో సమర్పించవలెయును చుక్క గుర్తు ఉండిన ఉపచారములకు మాత్రమే ఘంట మ్రోగించవలెను తక్కిన ఉపచారములయందు ఘంట మ్రోగించిన అపకారము కలుగును.**

| | |
|---|---|
| * ౧. ఆవాహనము | ౯. గంధము |
| ౨. ఆసనము | * ౧౦. పుష్పము |
| ౩. పాద్యము | * ౧౧. ధూపము |
| * ౪. అర్ఘ్యము | * ౧౨. దీపము |
| ౫. ఆచమనము | * ౧౩. నైవేద్యము |
| * ౬. స్నానము | ౧౪. నమస్కారము |
| ౭. వస్త్రము | ౧౫. ప్రదక్షిణము |
| ౮. యజ్ఞోపవీతము | ౧౬. ఉద్వాసనము |

ప్ర : అర్ఘ్య, పాద్యములు మొదలయినవాని నెచట వుంచవలెను ?

స : విష్ణుతిలక సంహితయందు.

శ్లో॥ అర్ఘ్యం శిరసి నిక్షిప్య, పాద్యం పాదతలే న్యసేత్ ।
హస్తేష్వాఽచమనం చైవ, గంధంకాయాఽను లేపనం ।
పుష్పమ్ మూర్ధ్నితు విన్యస్య, భోజ్యమ్ కరతలేన్యసేత్ ।
దీపంతు నేత్ర ద్వయోర్దద్యా ద్ధూపమ్ వామాంతరేమ్ న్యసేత్ ।
అన్యథా విపరీతశ్చేత్ కులక్షయకరం భవేత్.



తా ॥ అర్ఘ్యము భగవంతుని శిరసునందును, పాద్యము పాదముల యందును, ఆచమనము చేతియందును, (చూపించి పతత్ గ్రహపాత్ర యందుంచవలెను) చందనము (వక్షఃస్థలమునకు) శరీరమునకు పూయవలెను; పుష్పములు శిరమునందుంచ వలెను; నివేదన ద్రవ్యము (కుడి) అఱ చేతియందుంచవలెను. భగవానుని రెండు కనులకు దీపమును-ముక్కు ఎడమ రంధ్రమునకు ధూపమును అర్పించ వలెను. ఇంకొక విధముగా తారుమారు చేసినచో వంశ నాశనము కలుగును.

## * శయ్యాసన మంత్రము *

శ్లో॥ భగవన్ ! భోగ నిద్రాయాః కాలోఽయం సముపాగతః
శేషపర్యంక శయన మలంకురు జగత్ప్రభో ! (శ్రీప్రశ్నే)

ఉదఙ్ ముఖమ్ - ప్రాక్ శిరసమ్ ప్రతిమామ్ శాయయేత్ తతః

పవళింపు సేవ సమయమున శ్రీ భగవానుని ముఖము ఉత్తరము చూచునట్లునూ, శిరము తూర్పుదికునకునూ (పాదములు పడమరకునూ) ఉంచి సేవ చేయవలెను.

శిలాబింబం దారుబింబం స్వగృహే నాఽర్చయేద్బుధః
గృహే సంహార శయన మర్చయే న్న కదాచన (పాద్మే - క్రియా - 32 ప్ర)
పూజాస్థానమ్ గృహస్యోక్తం మారుత్యాం దిశి నా ఽన్యథా

## * శయన బేరమును మేల్కొల్పు మంత్రము *

ఉత్థాపన మంత్రమ్

ఉత్తిష్ఠ బ్రహ్మణస్పతే । దేవయన్తస్త్వేమహే
ఉపప్రయన్తు మరుతస్సుదానవః । ఇంద్రః
ప్రాశూర్భవాసచా । ప్రైతు బ్రహ్మణ స్పతిః ।
ప్రదేవ్యేతు సూనృతా । అచ్ఛావీరం నర్యం
పంక్తిరాధసమ్ । దేవాయజ్ఞమ్ నయతువః

ప్ర : చతుః స్థానార్చనమ్ అనగా ఏమి ?

స : 1 కుంభము - 2 బింబము - 3 కుండము - 4 మండలము ఈ నాలుగింటి యందు శ్రీమహాలక్ష్మి సహితుడగు శ్రీమన్ నారాయణుని భక్తి - శ్రద్ధలు గల మనసుతో

ఆవాహనము చేసి పదునారుఉపచారములతో శ్రీ పురుష సూక్తము మున్నగు మంత్రములతో అర్చించుటను చతుః స్థానార్చనము అందురు.

## ✽ షోడశోపచార క్రమము ✽

౧. ఆవాహనము

ఆవాహనమునకు ముందు భగవన్మూల (కర్మ) బేరమును ప్రార్థనము చేయవలెను.

**ఆవాహనము వేని యందు చేయవలెను.**

శ్లో॥ స్థలే-రత్నమయస్థానే - విమానే చ తథావిధే ।
అప్సావగ్నౌ - హృదయే - సూర్యే- స్థండిలే - ప్రతిమాసుచ (పాద్మ చర్యా - ౬ ౧)

తా॥ శుభ్రమగు స్థలము, రత్నములు, విమాన గోపురము, జలము, అగ్ని, హృదయము, సూర్యబింబము, అలంకరించిన వేది, విగ్రహములయందు భగవంతునితేజమును ఆవాహనము చేయవలెను.
(చక్రాబ్జా౽ ది మండలములయందునూ, కుశ కూర్చలయందును ఆవాహనమొనర్పవచ్చును)

ఏ బింబము లేదో దానికి బదులుగా కూర్చయందామూర్తిని
ఆవాహనము చేసి పూజింపవలెను. (పద్మసంహితా)

**విష్ణుతిలక సంహితయందలి ప్రార్థనము**

శ్లో॥ కూర్మాదీన్ దివ్యలోకాన్ తదను మణిమయ మణ్డపమ్ తత్రశేషమ్ ।
తస్మిన్ ధర్మాదిపీఠమ్ తదుపరికమలమ్ చామరగ్రాహిణీశ్చ ।
విష్ణుమ్ దేవీ ర్విభూషా౽యుధగణ మురగమ్ పాదుకేవైనతేయమ్ ।
సేనేశమ్ ద్వార పాలాన్ కుముదముఖగణాన్ విష్ణుభక్తాన్ప్రపద్యే ।

యోగపీఠమున నున్న ధృవబేరమునుండి తక్కిన బేరములకు తేజమును (కళలను) ఆవాహనము చేయవలెను.

ప్ర : యోగ పీఠమన నేమి ?
స : "బింబేన సహితమ్ పీఠమ్ యోగపీఠ ముదాహృతమ్ ।
తా॥ మూల బేరము క్రిందనున్న పీఠమే యోగ పీఠమనబడును.



**ఆవాహన మంత్రము :**

"ఓమ్ ఓమ్ ఓమ్ పరమధామావస్థిత మదనుగ్రహ కామ్యయా౽ద్య వతార !
ఇహామిమత సిద్ధిద మంత్ర శరీరోమ్ నమః ।

ప్ర : ఆవాహనము ఎచటనుండి ఎచటకు ఎన్నవవంతు తేజమును చేయవలెను.
స : నారాయణ సంహిత మరియును ఈశ్వర సంహితలయందిట్లు గలదు.

శ్లో॥ మూలబేరస్య యత్తేజః షడ్భాగైకంతు కర్మణి ।
కర్మబింబాంశ షడ్భాగం పంచాంశం తూత్సవస్యతు ।
తద్బింబాంశ చతుర్భాగం స్నాన బింబముదాహృతం
తద్బింబస్య త్రిభాగాంశం బలిబింబముదాహృతం
బలిబింబద్విభాగాంశం తీర్థబింబే నియోజయేత్ ।
శయ్యాబేరం తతః కుర్యాత్ ఏకాంశేన విధీయతే
తత్కర్మావసానేతు పునర్మూలేన యోజయేత్ ।

తా॥ మూల బేర తేజమును ఆరు భాగములుచేసి ఒక భాగము కర్మబింబమునందును, కర్మ బింబ తేజములో ఐదవపాలు ఉత్సవ బింబము నందును; ఉత్సవ బింబ తేజమున నాల్గవ భాగము స్నాన బేరమునందును; స్నానబేర తేజమున మూడవ భాగము తీర్థ బేరమునందును, తీర్థ బేర తేజమున రెండవ పాలు బలిబేరము నందును; బలిబేర తేజమున ఒకపాలు శయన బేరము నందును ఆవాహనము చేయవలెను. పూజ ఐన పిమ్మట క్రముగా తిరిగి మూల బింబమునందు చేర్పవలెను.

**ఆవాహనము చేయు పద్ధతి**

విష్ణు తిలక సంహిత యందిట్లున్నది.

కూర్చలో మూలబేర హృదయము ద్వారా తేజమును ముక్కు కుడి రంధ్రము నుండి పాత్ర జలము లోనికి ఆవాహనముచేసి దానిని కర్మబింబ బ్రహ్మ రంధ్రము (నడి శిరస్సు) ద్వారా ఆబేరమున ప్రవేశ పెట్టవలెను; ఇట్లే తక్కిన వానియందును చేయవలయును; ఇది యంతయు దీపము నుండి దీపము వెలిగించి నట్లుగా భావించుచు చేయవలెను.

ప్ర : ఎన్ని మారులు అర్చనము చేసిన అన్నిమారులు ఆవాహనము చేయవలెనా?
స : అవసరములేదు.

శ్రీ ప్రశ్న సంహితయందిట్లున్నది.

శ్లో ॥ త్రికాల మర్చనాయుక్తే ఏకదాఽవాహనమ్చరేత్ ॥
మూడు మారులు (లేక ఒకేదినమున నెన్ని మారులు) అర్చన చేసిననూ ఆవాహనము ౹ మొదటిసారి చేయు అర్చన యందు మాత్రమే (ఒక మారు మాత్రమే) ఆవాహనము చేయవలెను.

౨. ఆసనము

ప్ర : ఏ మంత్రముచే భగవానుని ఆసనము నందు కూర్చొన జేయవలెను?
స : భగవానుని పాదముల చెంత నొక సుగంధ పుష్పమును ఉంచి - "ఓమ్ ప్రతిద్విష్ణు స్తవ తే వీర్యాయ మృగోన భీమః కుచరోగిరిష్ఠా యస్యోరుషు త్రిషు విక్రమణేష్వధి క్షియన్తి భువనాని విశ్వ ॥ అను మంత్రము పఠించవలెను.

౩. పాద్యమంత్రము

"ఓమ్ త్రీణి పదావిక్రమే విష్ణుర్గోపా అధాభ్యః తతో ధర్మాని ధారయన్"

౪. అర్ఘ్య మంత్రము

"ఓమ్ విష్ణోర్నుకమ్ వీర్యాణి ప్రవోచంయః పార్థివాని విమమేరజాగ్ంసి యో అస్కభాయదుత్తరగ్ం సధస్థం విచక్రమాణ స్త్రే ధోరుగాయః"

౫. ఆచమన మంత్రము

"ఓమ్ వాజే వాజే ఉతవాజినో నోధనేషు ధియో విప్రా అమృతాఋతజ్ఞాః అస్య మధ్వః పిబత మాదయధ్వంతృప్తా యాత పధిభిః దేవయానైః"

౬. స్నాన మంత్రము

పురుష సూక్తమును పఠించుచు స్నపనము చేయింప వలెను.
(ఓమ్ తచ్చం యోరావృణీమహే)

౭. వస్త్ర మంత్రము

"ఓం అభివస్త్రాసువసనా న్యర్షాభి ధేనూసుదుఘా పూయమానః అభిచంద్రా భర్తవేనో హిరణ్యాభ్యశ్వాన్ రధినో దేవ



౮. యజ్ఞో పవీత మంత్రము

"జితమ్ తే" మంత్రము.

౯. గంధమంత్రము

"ఓం గన్ధ ద్వారాం దురాధర్షాం నిత్యపుష్టాం కరీషిణీం ఈశ్వరీగ్ం సర్వభూతానాం తామిహోపహ్వ యే శ్రియం"

౧౦. పుష్పమంత్రము

"ఓం ఆయనేతే పరాయణే దుర్వారోహంతు పుష్పిణీః హ్రదాశ్చ పుండరీకాణి సముద్రస్యగృహాయిమే"

౧౧. ధూప మంత్రము

"ధ్యూమ్ ధూమోద్గిరాయ నమః"

౧౨. దీప మంత్రము

"ఓం ఉద్దీప్యస్వ జాతవేదోఽపఘ్నం నిర్‌ఋతిం మమ పశూగ్ శ్చ మహ్య మావహ జీవనంచ దశోదిశ"

౧౩. నివేదన మంత్రము (32 పెద్ద ముద్దలు నివేదింపవలెను.) (శ్రీ ప్రశ్న సంహిత)

పగలు : సత్యమ్ త్వర్తేన పరిషంచామి
రాత్రి : ఋతంత్వా సత్యేన పరిషంచామి
| అమృతమస్తు ! అమృతోఽపస్తరణమసి !

"ఓం హం హం హం ఇదమిదం గృహాణ స్వాహా - ఓం దేవస్యత్వాసవితుః ప్రసవే అశ్వినోర్బాహుభ్యాం పూష్ణోహస్తాభ్యాం ప్రతిగృహ్ణామి"

౧౪. నమస్కార మంత్రము

దాసోహంతే జగన్నాధ ! సపుత్రాది పరిగ్రహ
ప్రేష్యం ప్రశాధి కర్తవ్యే మాం నియుంక్ష్వ హితేసదా ॥

౧౫. ప్రదక్షిణ మంత్రము "త్రీణి పదా విచక్రమే" .....

శ్లో॥ ఏకం గాణాధిపే కుర్యాత్, ద్వేసూర్యే, త్రీణి శంకరే,
చత్వారిః కేశవేదేవే, సప్తాఽ శ్వద్ధే ప్రదక్షిణమ్ ॥ (పౌష్కర సంహితా)

విష్ణువునకు నాలుగు మారులు చేయవలెను.

### ౧౬. ఉద్వాసన మంత్రము

"ఓం భగవన్ మంత్ర మూర్తే స్వపద మాసాదయా సాదయ - ఓం యజ్ఞేన యజ్ఞమయజన్తదేవాః తాని ధర్మాణి ప్రథమాన్యాసన్ తేహనాకం మహిమానస్సచన్తే. యత్ర పూర్వే సాధ్యా సన్తి దేవాః"

ప్రతి ఉపచారమునకు "దివ్యమంగళ విగ్రహాయ శ్రీమన్నారాయణాయ సమర్పయామి" అని చెప్పవలెను.

## * అష్టదిక్పాలకులు *

దిక్కులు 8 : 1. తూర్పు; 2. ఆగ్నేయము; 3. దక్షిణము; 4. నైఋతి; 5. పడమర; 6. వాయవ్యము; 7. ఉత్తరము; 8. ఈశాన్యము.

దిక్పాలకులు 8 : (అనగా దిక్కులను పాలించువారని అర్థము)

| | |
|---|---|
| 1. తూర్పు-ఇంద్రుడు | 5. పడమర-వరుణుడు |
| 2. ఆగ్నేయము-అగ్ని | 6. వాయవ్యము-వాయువు |
| 3. దక్షిణము-యముడు | 7. ఉత్తరము-కుబేరుడు |
| 4. నైఋతి-నిర్రుతి | 8. ఈశాన్యము-శివుడు |

## * దిక్పాలక మంత్రము *

**1. ఇంద్ర మంత్రమ్ :**

"ఓం ఇంద్రం వో విశ్వతస్పరి హవామహే జనేభ్యః అస్మాకమస్తు కేవలః"

**2. అగ్ని మంత్రమ్ :**

"ఓం అగ్నిం దూతం వృణీమహే. హోతారం విశ్వ వేదసం అస్య యజ్ఞస్య సుక్రతుం"

**3. యమ మంత్రమ్ :**

"ఓం యమాయ సోమగ్ం సునుత యమాయ జివితా హవిః యమగ్ం హయజ్ఞో గచ్ఛత్యగ్నిదూతో అరంకృతః"



**4. నిర్రుతి మంత్రమ్ :**

"ఓం మోషుణః పరా పరా నిర్ఋతిః దుర్హణావధీత్ పదీష్ట తృష్ణయాసహ"

**5. వరుణ మంత్రమ్ :**

"ఓం ఇమంమే వరుణ శృధీహవ మద్యాచ మృడయ త్వా మవస్యురాచకే"

**6. వాయు మంత్రమ్ :**

"ఓమ్ తవవాయ వృతస్పతే త్వష్టుర్జామాత రద్భుత అవాంస్యా వృణీమహే"

**7. కుబేర మంత్రమ్ :**

"ఓం సోమోధేనుగ్ం సోమో అర్వంత మాశుగ్ం సోమో వీరం కర్మణ్యం దదాతు సాదన్యం వితద్యగ్ం సభేయం పితుశ్రవణం యో దదాశ దస్మయ్"

**8. ఈశాన మంత్రమ్ :**

"ఓం తమీశానమ్ జగతసస్థుషపతిమ్ ధియం జిన్వ మనసే హూమహే వయమ్ పూషానో యథా వేద సామ సద్వృధే రక్షితా పాయురబద్ధ స్స్వస్తయే"

## * రత్నాకరము *

### (వివిధ ముఖ్య విషయములు)

**మధుపర్కమ్** (విష్ణుతిలక సంహిత)

శ్లో॥ ఫలాన్యేలా ఫలం; సర్పి. । శర్క రాచ. మధూన్యపి ।
పంచానామపి సంయోగో । మధుపర్క ముదీరితమ్ ।

తా॥ పండ్ల రసము-ఏలకాయలు-నేయి-పంచదార-తేనె ఈ ౫ వ వస్తువులు కలిపిన దానిని మధుపర్క మందురు.

**పంచామృతములు :** (విష్ణుతిలక సంహిత)

శ్లో॥ పయో-దధి-ఘృతం (బ్రహ్మన్) మాక్షీకం మధు-శర్కరా ।
ఏతేషాన్తు సమాహారాత్ పంచామృత ముదీరితమ్ ।

తా॥ (ఆవు) పాలు-పెరుగు; నేయి; ఈగలు కూర్చిన తేనె-పంచదార ఈ ౫ ను పంచామృతములు (వీనితో సాలగ్రామమునకు స్నపన చేయింపవలెను)

(విహగేంద్ర సంహిత)

**ఆసనములు 6 :**

శ్లో॥ మంత్రాసనం, తధా స్నాన-మలంకారం, సుభోజనం ।
యాత్రాసనం, తథాశేతే షడైతే దేవతార్చనమ్ ॥

తా॥ మంత్ర-స్నాన-అలంకార-భోజ్య-యాత్ర-శయ్యాసనములు 6 ను ఆరాధన సమయములో భగవానునకు అర్చకుడు సమర్పింప వలెను.

(విష్వక్సేన సంహిత)

**సంకల్పము : అనగానేమి ?**

శ్లో॥ కర్మస్థలం తథా వర్షం, ఋతు-మాస-స్థథాఽయనమ్ ।
తిథి, ర్వారంచ నక్షత్రమ్ యోగమ్-కరణమేవచ
ఉక్త్వా కర్మ కరో మీతి చోఽక్తిః సంకల్ప ఉచ్యతే ॥

తా॥ పనిచేయు చోటు-సంవత్సరము-ఋతువు-మాసము-అయనము-తిథి-వారము-నక్షత్రము-యోగము-కరణములను (తలచుకొని) చెప్పుకొని చేయుపనికి సంకల్పమని పేరు.

**పంచాంగము అననేమి ?**

శ్లో॥ తిథిర్వారంచ నక్షత్రమ్ యోగం కరణ మేవచ ।
పంచానాం మపి సంయోగో పంచాంగమితీరితమ్ ॥

తిథి, వార, నక్షత్ర, యోగ, కరణములు కలిగిన దానిని పంచాంగ మందురు.

## ❋ సూతక విషయము ❋

శ్లో॥ వ్రత - యజ్ఞ - వివాహేషు, శ్రాద్ధే - హోమేఽర్చనే - జపే ।
ప్రారబ్దే సూతకమ్ నస్యాత్; నాఽరబ్దేతు సూతకమ్ ॥ (విష్ణువచనమ్)

తా॥ దీక్షాకంకణ ధారణచేసి వ్రతము - యజ్ఞము - వివాహము శ్రాద్ధము - హోమము - అర్చన - జపముల యందు దేనిని మొదలు పెట్టిన తరువాత ఆశౌచవార్త తెలిసిననూ కర్తకు సూతకము లేదు. మొదలు పెట్టనిచో - సూతక వార్త తెలిసిన ఆశౌచమును విధిగా పాటింపవలెను.



## ❋ అపత్నీకుని విషయము ❋

**ఆశౌచ విషయము**

ప్ర : భార్యలేని వాడు (లేక భార్య చనిపోయిన వాడు) అర్చన చేయవచ్చునా ?

స : చేయవచ్చును, దానికి సమాధానము **పాద్మసంహిత** యందు చర్యాపాద ఏకోనవింశతి (౧౯) అధ్యాయములో నిట్లున్నది. (శ్లో ౧౦౦, ౧౦౧, ౧౦౨)

శ్లో॥ ఆచార్య పదమారూఢో వైధుర్యా ద్యల్ప దోషవాన్ ।
అధికార్యేవ విజ్ఞాన పారంయాతో యది స్స్వయం ।
జ్ఞానాధికేనదేవేశే స్థాపితే జ్ఞాన దేశికే
నదోషా జ్ఞాన దహన స్సర్వ దోషాన్ దహేత్ఖలు ॥

తా॥ అర్చన చేయు ఆచార్య స్వామి తన అష్టాక్షరీ; ద్వాద శాక్షరీ మంత్ర జపము వలన అగ్ని కన్నను తేజస్వియై, అగ్ని అన్నిటిని కాల్చివేయునట్లుగా-ఏ దోషములును అంటక శుచిగా వుండును. (అనగా మహాపాతకములే వాని దరి చేరవు; భార్య-తల్లి, తండ్రి, సోదరుడు, కుమారుడు మొదలయినవారి మృతా శౌచము అర్చకుని అపవిత్రుని కావింప జాలదు, కనుక అతడు అర్చనము చేయవచ్చును, సంవత్సర సూతకము అర్చకునకు లేదు.)

ప్ర. ఏ, దేవతలను ఎవరు అర్చింపవలెను ?

(పాద్మే - క్రియాపాదే - ౨ అధ్యాయే - 61; 65 శ్లోకాః)

శ్లో॥ విష్ణోర్భాగవతైరేవ పంచరాత్ర పరాయణైః
పూజాకార్యా నసామాన్య దేవతా - మాతృపూజకైః ॥
శివస్య శివ శాస్త్రజ్ఞైః పూజనం చ శివద్విజైః
సోమపాభిః ద్విజశ్రేష్ఠైః కార్యమ్ దినకరాఽర్చనమ్ ॥
మదనమ్ చగణనాథమ్చ సుబ్రహ్మణ్యమ్ శివద్విజః ।
పూజయే ద్ధనదాఽదీనామ్ పూజకో విప్ర ఇష్యతే ॥

❋ **దుర్గామ్ సంపూజయే ద్దేవీమ్ సదాభాగవతై స్సదా ।**
మాతౄణామ్ అర్చనమ్ కార్యమ్ తజ్ఞయ్ పారశైస్తదా ।
శాస్త్రేరంచ మహామోటిమ్ కులాలః పూజయేత్ సదా ।

తా॥ (1) విష్ణువును అర్చించుటకు = పంచరాత్ర పరాయణులైన భాగవతులు మాత్రమే అర్హులు ! సామాన్యదేవతలను, మాతృకలను పూజించువారు పనికిరారు !

(2) శివుని అర్చించుటకు శైవాగమ పండితులగు శివద్విజులు అర్హులు !

(3) సూర్యుని పూజించుటకు = సోమయాజులునూ; బ్రాహ్మణోత్తములునూ తగుదురు !

(4) మన్మథునీ - గణపతినీ - కుమారస్వామినీ అర్చించుటకు = శైవాగమము అనుష్ఠించిన వారు పనికివత్తురు !

(5) కుబేరుడు మున్నగు వారిని పూజించుటకు = బ్రాహ్మణులు తగుదురు.

*** దుర్గాదేవిని అర్చించుటకు = భాగవతులను పేరప్రసిద్ధులైన పాంచరాత్రాగమ విదులు మాత్రమే తగినవారు !**

(6) మాతృకలను పూజించుటకు=మాతృకల తత్వము బాగుగ తెలిసిన(శూద్రస్త్రీకి బ్రాహ్మణుని వలన పుట్టిన) పారశవులు తగుదురు !

(7) బుద్ధునీ; గ్రామదేవతలనూ అర్చించుటకు=కుంభకార(కుమ్మర) కులమువారు తగుదురు !

పైన చెప్పబడిన దేవతలను ఆయా కులములవారు, ఆగమశాస్త్రములవారు మాత్రమే అర్చింపవలెను ! దానికి వ్యతిరేకముగా జరిగినచో - రాజు - ప్రజలు - దేశము సర్వ అరిష్టముల పాలబడుదురు !

**ప్ర : ఏ స్వామిని, ఏ కులమువారు ప్రతిష్టించిరో-తెలిసికొనుటెట్లు ?**

స : పురుషోత్తమ సంహితయందు చతుర్థో ఽ ధ్యాయములో నిట్లున్నది :

శ్లో॥ శూద్రప్రతిష్ఠితం కుర్యాత్ సోమసూత్రస్య లక్షణం
పాదవేద్యా శిలాయాంచ మకరానన మాఽచరేత్ ।
వైశ్యః కపోత వేద్యాంచ కుర్యా ద్గజముఖాఽకృతిః ॥
క్షత్రియః పట్టికాయాంచ మృగాధిపశిరాఽకృతిః ।
ద్విజో ద్విపట్టికాయాంచ కుర్యా ద్గోముఖవ ద్విజాః ॥



తా॥ బ్రాహ్మణులు ప్రతిష్ఠించిన; సోమ సూత్రము గోముఖము
క్షత్రియులు ప్రతిష్టించిన; సోమ సూత్రము సింహముఖము
వైశ్యులు ప్రతిష్టించిన; సోమ సూత్రము ఏనుగు ముఖము
శూద్రులు ప్రతిష్టించిన; సోమ సూత్రము మొసలి ముఖము కలిగివుండును !

ప్ర : అంగన్యాసములెన్ని ? దాని మంత్రములు ఏవి ?

స : అంగన్యాసములు ఆరు. వాని మంత్రములు
ఓమ్ జ్ఞానాయనమః ఓమ్ బలాయస్వాహా ఓమ్ వీర్యాయవషట్
ఓమ్ ఐశ్వర్యాయహుమ్ ఓమ్ తేజసే ఫట్ ఓమ్ శక్త్యై వౌషట్ ॥

## * న్యాసములు *

విష్ణుతిలకే-

శ్లో॥ సృష్టి-స్థితి-లయశ్చేతి న్యాసస్తు త్రివిధో భవేత్ ।
స్థితేదేవే స్థితిన్యాసః, ఆసీనే సృష్టి సంజ్ఞికః ॥
శయనే సంహృతి న్యాసః సంహార శ్శయనం యది ।
విశ్వరూపేస్థితి న్యాసః యానారూఢేత్రయంభవేత్ ॥
భోగే యోగేచ శయనే స్థితి న్యాసం ప్రచక్ష్యతే ।
వాసుదేవాది బింబేషు న కరన్యసనం మతమ్ ॥

తా॥ సృష్టి-స్థితి-లయ న్యాసములు 3 విధములు
నిలుచుని ఉన్న దేవునికి - స్థితి న్యాసము
కూర్చొని ఉన్న దేవునికి - సృష్టిన్యాసము
పరుండి ఉన్న దేవునికి - లయ న్యాసము
విశ్వరూపియై ఉన్న దేవునికి - స్థితి న్యాసము
వాహనము పైనున్న దేవునికి - సృష్టి - స్థితి - లయ న్యాసములు 3 న్యా చేయవలెను.
భోగ - యోగ - శయన మూర్తులకు - స్థితి న్యాసము

విష్ణు తిలకే – (మఱి ఒక విధము)

శ్లో॥ బ్రహ్మచర్యాఽశ్రమిణమ్ సృష్టిమ్, వానప్రస్థ–గృహస్థయోః।
స్థితిన్యాసో; యతీనాంతు సంహృతి న్యాస ఉచ్యతే ॥

తా॥ అర్చకుడు బ్రహ్మచారివైన, సృష్టిన్యాసము; గృహస్థుడుగానీ, వానప్రస్థుడుగానీవైన, స్థితి న్యాసము; సంన్యాసివైన సంహారన్యాసము చేయవలెను.

✪ వాసుదేవాది మూర్తులకు కరన్యాసము చేయరాదు.

## ✻ ఆలయ ధ్వజస్థంభమునకు తగిన కొయ్య ✻

ప్ర : ధ్వజమునకు ఏ – యే కొయ్యను ఉపయోగింప వచ్చును ?

స : కపింజల సంహిత ద్వా వింశతి (22) అధ్యాయములో ఇట్లున్నది.

శ్లో॥ అంతస్సారమ్ – బహిస్సారం ద్వి విధమ్ స్థంభముచ్యతే।
చంపకో, దేవదారుశ్చ, చందనః, ఖదిర స్థథా ॥
అర్జున – స్సాలవృక్షశ్చ, బిల్వః పనస ఏవచ।
ఏవ మాదీని దారూణి అంతస్సార ముదాహృతమ్ ॥
క్రముకం – నారికేళంచ వేణు – హింతాల మేవచ।
బహిస్సార మితి ప్రోక్తం తస్య లక్షణ ముచ్యతే ॥

తా॥ కొయ్య యందు అంతస్సారమనియు, బహిస్సార మనియు (లోపల చేవ – వెలుపల చేవ కలవి) రెండు రకములు కలవు.

1. లోపల చేవ కలవి : సంపెంగ – దేవదారు – గంధపుమ్రాను – చంద్ర – ఏరుమద్ది – మద్ది; మారేడు – పనసచెట్లు మిక్కిలి మంచివి.
2. వెలుపల చేవ గలవి : పోక – కొబ్బరి – వెదురు –గిఱక తాడి ఈ చెట్లు కొంతవరకు పనికివచ్చును.

ప్ర : స్థంభము ఏ రీతిగా – ఎంత ఎత్తు ఉండవచ్చును ?

స : ఈ విషయముకూడా కపింజల సంహిత ద్వా వింశతి (22)వ అధ్యాయములో నున్నది.



శ్లో॥ శతతాల సమాఽయామం – తదర్థం వా ద్విజోత్తమ।
అశీతితాల మథవా – ప్రాసాదోఽచ్ఛ్రాయ మేవవా ॥
గోపురోఽచ్ఛేద మాత్రంవా ఛేద, ఛిద్ర వివర్జితం।
అవక్రం – నిర్వ్రణం – స్నిగ్ధం – గ్రంధి – రంధ్ర – వివర్జితం ॥
ఏవం లక్షణ సంయుక్తం ధ్వజ దండ మిహోచ్యతే।

తా॥ (తాలము అనగా 12 అంగులముల పొడవుగల కొలత-1 అడుగు) 100 అడుగులు కానీ, 50 అడుగులు కానీ, ఎనుబది (80) అడుగులు కానీ, ఆలయపు ఎత్తుగానీ, ధ్వజము ఉండవలెను.

ధ్వజమునకు ఎన్నిక చేయు కఱ్ఱకు గంటు (కోతలు) బెజ్జములు – వంకర లేకుండగ ఉండవలెను; నున్నగ చేయబడవలెను; ముడులు – తొఱ్ఱలు లేనిదిగా నుండవలెను;

దీనికి ఇంకొక సమాధానము –

పాద్మ సంహిత యందు చర్యాపాద దశమోఽధ్యాయములో నిట్లున్నది-

శ్లో॥ అన్తస్సారో – బహిస్సారో – నిస్సారో స్త్రివిధ స్తరుః।
క్రముకాది బహిస్సారం – ప్రశస్తం విదురుత్తమం ॥
అన్తస్సారం చన్దనాది ప్రశస్తం స్థంభ కల్పనే।
నిస్సారం వర్జయేత్ స్థంభం శతతాలాయతం శుభం ॥
మానాంగులప్రమాణేన వింశత్యూన మథాపివా।
ప్రాసాదోచ్ఛ్రాయ మథవా – యద్వా గోపుర సమ్మితం ॥

తా॥ లోపల చేవ కలవి – బయట చేవ కలవి – ఎచటను చేవ లేనివి అని చెట్లు మూడు విధములు.

1. పోక మొదలగునవి బయట చేవ కలవి;
2. గంధపుచెట్టు మొదలగునవి లోపల చేవ గలవి; ఈ లోపల చేవ కలవి ధ్వజమునకు మిక్కిలి ప్రశస్తము;
3. చేవయే లేనివి (అనగా గోగు–ములగ–బాదము మొదలయినవి) ఉపయోగింపనే రాదు; నూరు (100) అడుగులు ఎత్తు ఉత్తమము; ఇరువది (20) అడుగులు

ఎత్తు తగ్గకుండ నుండవలెను; ఆలయపు ఎత్తయినను - విమాన గోపురము ఎత్తయినను, ధ్వజము పొడవు ఉండవచ్చును.

**ప్ర : గరుడ పటము1–3 (5 అంతకన్న ఎక్కువ) దినములయందు జరుగు కళ్యాణోత్సవములకు కట్టవలెనా ?**

స : "ఏకాహేత్ర్యహ్యకే ధీమాన్ ధ్వజకర్మన కార కారయేత్"
(పాద్మే - చర్యా - ౧౦ అ)
"ఏకాహ్నే త్ర్యహ్నేవా ధీమాన్ ధ్వజకర్మ నకారయేత్"
(కపింజలే - ౨౨ ద్వావింశత్యధ్యాయే)
"ఏకాహేచత్రయాహేచ ధ్వజకర్మ నకారయేత్"
(పురుషోత్తమ సంహితాయాం ౨౩ అధ్యాయే)

తా॥ ఒకనాడు లేక మూడు రోజులు జరుగు కళ్యాణోత్సవములయందు ధ్వజపటము (గరుడగుడ్డ) కట్టరాదు. 5-7-9 దినములు జరుగు వాటికి కట్టవలెను.

**ప్ర : అంకురారోపణము; గరుడపట (ధ్వజ) ఆరోహణము రాత్రియందే చేయుచున్నారు. ఇది ఆగమ శాస్త్ర సమ్మతమా ?**

స : శాస్త్రసమ్మతము కాదు.

**శాస్త్రాధారము :**

పాద్మే - చర్యా పాదే ౧౦ అధ్యాయే
"..... నిశ్యంకురార్పణం ప్రదోషేఽ న్వధ్వజారోహో భేరీ తాడ సమన్వితః"
రాత్రియందు అంకురారోపణము; మరునాటి సూర్యోదయవేళ ధ్వజారోహణము చేయుట ఆగమ సమ్మతము :

## * వాహన క్రమము *

శ్రీ పురుషోత్తమ సంహితయందు 24వ అధ్యాయములో

శ్లో॥ ప్రథమేఽహని దేవస్య హంస వాహన మిష్యతే ।
ద్వితీయ దివసే సింహమ్, తృతీయేతు ఖగేశ్వరః ॥
చతుర్థేఽహని శేషశ్చ, పంచమే చాఽఞ్జనీ సుతః ।



షష్ఠేతు సూర్య - చంద్రౌచ, రథాఽరోహంతు సప్తమే ।
అష్టమేతు తురంగమ్స్యా న్నవమే గజమేవచ ।

తా॥ శ్రీమన్నారాయణుని కళ్యాణ మహోత్సవమున జరుపు గ్రామోత్సవమునందు ఈక్రింద విధముగా వాహనములను ఉపయోగింపవలెను.

| | |
|---|---|
| ౧వ నాడు = హంస | ౬వ నాడు = ఉదయము : సూర్యరాత్రికి : చంద్ర |
| ౨వ నాడు = సింహ | ౭వ నాడు = రథ |
| ౩వ నాడు = గరుడ | ౮వ నాడు = అశ్వ |
| ౪వ నాడు = శేష | ౯వ నాడు = గజ (వాహనములు) |
| ౫వ నాడు = ఆంజనేయ | |

## * పన్నెండు ప్రదక్షిణములు *

ద్వాదశావరణ క్రమము

**ప్ర : భగవంతునికి పన్నెండు ప్రదక్షిణములు ఏ – యే ధ్వనులతో చేయింపవలెను.**

స : -

శ్లో॥ భేరీ-నృత్తంచ-గీతంచ-మృదంగం-మురళీ స్థథా
ఘంటా-తాళంచ-శంఖంచ-శృతి-కాహళ మేవచ
వేద ఘోషంచ-మౌనంచ; ద్వాదశావరణక్రమమ్ ।

తా॥ (1) ఢంకా (2) నాట్యము (3) పాడుట (4) మద్దెల (5) పిల్లనగ్రోవి (6) గంట (7) భజన తాళములు (8) శంఖధ్వని (9) శృతి ధ్వని (10) కొమ్ముబూర (లేక బాకా) (11) వేద ఘోష (12) మౌనము (మాట్లాడకుండుట) వీనితో భగవంతునకు 12 ప్రదక్షిణములు చేయింపవలెను.

## * ఆళ్వారుల పేర్లు *

| | |
|---|---|
| ౧. పూదత్తాళ్వార్ | ౪. తిరుమళిశై యాళ్వార్ |
| ౨. పొయ్ గైయాళ్వార్ | ౫. నమ్మాళ్వార్ |
| ౩. పేయాళ్వార్ | ౬. కులశేఖరాళ్వార్ |

౭. తొండరడిప్పొడి యాళ్వార్ ౧౦. తిరుమంగయాళ్వార్
౮. పెరియాళ్వార్ ౧౧. తిరుప్పాణి యాళ్వార్
౯. శ్రీ ఆండాళ్ ౧౨. మధురకవి యాళ్వార్

వీరు పన్నిద్దరు (12 మంది) అళ్వారులు.

★ అళ్వారులు అనగా శాసించువారు అని అర్థము.

## ❋ చతుర్ వ్యూహములు ❋

1. వాసుదేవ 2. సంకర్షణ 3. ప్రద్యుమ్న 4. అనిరుద్ధ

**ప్ర : ఏ-యే అవతారములు ఏ-యే వ్యూహమునుండి వెలువడినవి ?**

స : ఈ విషయము పాద్మ సంహిత జ్ఞానపాద ద్వితీయో ఽ ధ్యాయమున నిల్లున్నది.

1. వాసుదేవ వ్యూహము నుండి - మత్స్య-కూర్మ-వరాహ అవతారములు
2. సంకర్షణ వ్యూహమునుండి - నృసింహ-వామన-పరశు రామావతారములు.
3. ప్రద్యుమ్నవ్యూహమునుండి - రామ - బలరామావతారములు.
4. అనిరుద్ధ వ్యూహము నుండి-కృష్ణ-కల్కి అవతారములు వెలువడినవి

**ఆగమమున చెప్పబడిన అవతారములు ఎన్ని ?**

పర-వ్యూహ-విభవ-అంతర్యామి-అర్చ అవతారములు.

## ❋ చతుర్ వ్యూహములు ❋
### (పదవివరణము)

**వాసుదేవ (౧వ) వ్యూహము**

శ్లో॥ వసన్తి త్వయి భూతాని । బ్రహ్మాండేహి యుగక్షయే ।
త్వమావససి భూతేషు । వాసుదేవస్తతోచ్యతే ॥

తా॥ బ్రహ్మాండములు-యుగములు నశించినపుడు పంచభూతములు ఎవని యందుండునో ఆతడే వాసుదేవుడు.



**సంకర్షణ (౨వ) వ్యూహము**

శ్లో॥ సంకరిష్యసి భూతాని । కల్పే-కల్పే పునః పునః ।
తతః సంకర్షణః ప్రోక్తో । తత్త్వజ్ఞాన విశారదైః ॥

తా॥ ప్రతి కల్పమునందును, మరల-మరల నెవడు భూతముల సృష్టించునో-ఆతడే సంకర్షణుడని భగవత్తత్త్వము నెరిగినవారు తెల్పుదురు.

**ప్రద్యుమ్న (౩వ) వ్యూహము :**

శ్లో॥ ప్రత్యూహేనతిష్ఠంతి సదేవాసుర రాక్షసాః ।
ప్రతిద్యుః సర్వధర్మాణామ్ ప్రద్యుమ్నస్తేనోచ్యతే ॥

తా॥ దేవ-అసుర-రాక్షస గణములు కల్పించు ఆటంకములు పోవుటకు జీవులు సర్వధర్మ రక్షకుడనగు నీ సేవ వలన విఘ్నములు లేక యుందురు; కావున నిన్ను ప్రద్యుమ్నుడందురు.

**అనిరుద్ధ (౪వ) వ్యూహము :**

శ్లో॥ నిరోధో విద్యతేయస్మా న్నతే భూతేన కశ్చన ।
అనిరుద్ధస్తతః ప్రోక్తః పూర్వమేవ మహర్షిభిః ॥

తా॥ ఏ ప్రాణి వలనను నీకు ప్రతిరోధము (అడ్డు) లేదు గనుక పూర్వమే మహర్షులు అనిరుద్ధు డనిరి.

**ప్ర : విగ్రహమునకుగల ఇతర పేర్లు ఏమి ?**

స : 1. అర్చ; 2. ప్రతిమ; 2. ప్రతీక; 4. బింబము; 5. బేరము; 6. లింగము; 7. వపుః; 8. చిహ్నము; 9. బొమ్మ; 10. గురి (గుఱుతు); 11. మూర్తి; 12. ఆయతనము; మొదలైనవి.

## ❋ బలిద్రవ్యదాన మంత్రమ్ ❋

శ్లో॥ భూతాః పిశాచాః నాగాశ్చ అసురాః రాక్షసాః గ్రహాః ।
సర్వేతే వ్యపగచ్ఛన్తు బలితుష్టాః యథాతథమ్ ॥
దేవానాంచ ద్విజానాంచ స్థానం సమ్యక్ కరోమ్యహమ్ ।
వాసుదేవస్య దేవస్య సర్వ భూతాత్మకస్య చ ॥

## * బలిద్రవ్య ప్రమాణమ్ *

ప్ర : భూత బలికి ఎంత ద్రవ్యమును ఇవ్వవలయునో తెల్పుడు ?

స : దీనికి సమాధానము సారసముచ్చయమ్ అను గ్రంధములో నిట్లున్నది.

శ్లో॥ ఉత్తమం కబళం ప్రోక్తమ్, మధ్యమం ముష్టి మాత్రకమ్
అధమంత్వాఽహుతే ర్మానం, బలిమానం త్రిధా భవేత్।

తా॥ ఒకమారు మ్రింగతగిన ముద్ద ఉత్తమము; గుప్పెడు మధ్యమము; మూడు వ్రేళ్ళకు వచ్చునంత అధమము;

★ **బలి వేయవలసిన చోట్లు :**

రెండు లేక అంతకన్న ఎక్కువ వీధులు కలసిన చోట్లు; చాల ఏండ్ల వయస్సు కలిగిన చెట్లుఉన్న స్థలములు; వీధుల చివరలు; ఇతర దేవతల ఆలయములవద్ద; బావి, చెరువు, నది తటస్థపడిన అచ్చటను బలి వుంచవలెను.

**బలిద్రవ్య నిరూపణమ్ (పురుషోత్తమే ౩౨ అ)**

శ్లో॥ ప్రాతస్తు తండులై రేవ బలిమ్ దద్యాద్యధాక్రమమ్।
అన్నై నైవతు మధ్యాహ్నే సాయాహ్నేకుసుమై శ్శుభైః।

తా॥ ఉదయము బియ్యము తోడనూ - మధ్యాహ్నము అన్నముతోడనూ - సాయం కాలము పూవులతోడనూ బలినివేయవలెను.

## * భగవదర్చనకు పనికివచ్చు పూలు *

శ్లో॥ గ్రాహ్యం సుగంధి కుసుమం, నిర్గంధం వర్జయే ద్ధరేః
చంపకం-కరవీరంచ-మల్లీ-జాత్యుత్పలాదికమ్।
దమనోఽశీర, లామజ్జా-తులస్యాదీన్ సమాహరేత్।

తా॥ మంచి మనోహరమగు వాసనవచ్చు పూవులను మాత్రమే విష్ణుపూజకు వాడవలెను. వాసన లేనివి (చెడు వాసన వచ్చునవి-మిక్కిలి ఘాటు వాసన కలవి) వాడరాదు.

సంపెంగ-గన్నేరు-మల్లె-జాజి (సన్నజాజి, విరజాజి) కలువ, మొదలగు పూలు-

దమనము (దవనము) వట్టివేరు, తులసి మొదలయిన పత్రములు ఉపయోగింప వలెను.



సూచన : నీటియందు పుట్టిన పూలను ఎల్లవేళలయందును విష్ణు పూజకు వాడవచ్చును. గన్నేరు పూవులను ఆలయమున భగవత్ పూజకు వాడవచ్చును; కానీ-గృహ తిరువారాధనమున వాడరాదు; ఇంటియందలి పూజకు గన్నేరు పూలను వాడినచో కులక్షయమగును. (పద్మసంహిత)

ప్ర **తులసిని ఏ యే దినములందు కోయరాదు ?**

స : సంక్రమణము : ద్వాదశి-శుక్రవారము-మంగళవారము; పర్వదినములయందు కోయరాదని చెప్పబడి యున్నది-కాని;

శ్లో॥ నియమేనార్చనార్ధంతు తులసీం నిత్యమాహరేత్।
దినదోషో-వారదోష స్తిథిదోషో నవిద్యతే।

తా॥ పూజను నిత్యము చేయువారు (అర్చకులు) తులసిని ఏనాడయినను కోయవచ్చును. దిన-వార తిధి దోషములు లేవు. (వారిని బాధింపవు)

శ్లో॥ శ్వేతైః పుష్పైః సమభ్యర్చ్య సర్వాన్ కామానవాప్నుయాత్।
ఐశ్వర్యం ప్రాప్నుయాల్లోకే పీతై రేవం సమర్చయన్।
శత్రూనామాభిచారేషు తథా కృష్ణమ్ సమర్చయన్।
సువర్ణ పుష్పదానేన రాజసూయ ఫలంలభేత్।

తా॥ తెల్లపూలతో పూజ చేసిన అన్ని కోరికలు నెరవేరును. పసుపు పచ్చని పూలతో పూజించిన ఐశ్వర్యము కలుగును-విరోధులు నశించవలెననిన నల్లని (నీలపు) పూలతో అర్చించవలెను; బంగారు వన్నె కలిగిన పూలతో అర్చించిన రాజసూయ యాగము చేసినంత ఫలితము లభించును.

★ సంవత్సరమునాటి తులసి-ఆరునెలలనాటి మారేడు-పదునైదు దినములనాటి వెలగ ఆకులు; ఏడు దినములనాటి పద్మము-మూడునాళ్ళనాటి గరిక (ఆదివరకు పూజకు ఉపయోగింపనిచో) భగవత్పూజనమునకు పనికి వచ్చును.

## * హవిర్ నివేదనమ్ *

ప్ర : ప్రసాదము (హవిస్సు) నెట్లు నివేదించవలెను ?

స : **అనంతాఖ్య** సంహిత యందిట్లున్నది-

శ్లో॥ భక్ష్య-భోజ్యాఽన్న-పానాఽదీన్ । భగవద్దక్షిణే కరే ।
నైవేద్యానిచ సర్వాణి । ప్రత్యేకం గ్రాస ముద్రయా ॥

శ్లో॥ ఏకవారం-త్రివారం వా-పంచవార మథాపివా ।
సప్తవార హరేః పాణౌ నైవేద్యం తత్ సమర్పయేత్ । (పద్మసంహిత)

తా॥ భక్ష్యములు (పిండివంటలు) అన్నము; పానీయములు (పానకము పాలు మొ॥) అస్త్రాయఫట్ అని అస్త్రమంత్రముతో అష్టదిగ్ బంధనము చేసి, స్వీమ్ సురభయేనమః అను సురభి మంత్రముతో సురభి ముద్రమాపి. భగవానుని కుడి అరచేతియందు గ్రాసముద్రతో ఒకసారి-మూడు-ఐదు- ఏడు మారులు నివేదనము సమర్పింప వలెను.

## * అర్చకుని గొప్పతనము *

శ్లో॥ సాధకస్య ప్రభావేన । శిలాభవతి కేశవః ।

తా॥ మంత్ర-నిష్ఠా గరిష్ఠుడైన అర్చకుని అర్చనవలన రాతి బొమ్మ (భక్తుల కోర్కెలను తీర్చుటకు) నారాయణునిగా మారును ।

శ్లో॥ అర్చకస్య హరి స్సాక్షాత్ । చరరూపీ న సంశయః ।

తా॥ మన కనుల ఎదుట తిరుగుచు కనుబడునటువంటి అర్చకుడే శ్రీహరి యగును- సందియము లేదు.

## * ప్రసాదములో అర్చకభాగము *

కపింజల సంహితలో నిట్లున్నది :

శ్లో॥ నివేదితంతు యద్ద్రవ్యం । చతుర్ధా విభజేత్తతః ।
ఏకాంశం సమాదాయ । ఆచార్యాయ ప్రదాపయేత్ ।
శేషాంశం సమాదాయ । సర్వ భక్తాన్ ప్రదాపయేత్ ।

తా॥ భగవానునకు నివేదించిన ప్రసాదము నాలుగు భాగములుచేసి-ఒక భాగము అర్చక స్వామికి, తక్కిన మూడు వంతులు భక్తులందరికి పంచవలెను.



## * అర్చకుని భుక్తికి లోపము కలిగిన ? *

పారమేశ్వర సంహిత యందిట్లున్నది :

శ్లో॥ ఆచార్య భోజనాహీనే । దేవపూజాచ నిష్ఫలా ।

తా॥ అర్చకస్వామి భుక్తికి తక్కువైనచో (యజమానులు ద్రవ్య-ధాన్యములు తగిన రీతిగా సకాలమున యివ్వక పోయిన) చేసిన దేవపూజ నిష్ఫలమై పోవును, కావున లోకము-యజమానులు క్షేమముగా నుండరు.

## * నవరత్నములు *

1. మాణిక్యము, 2. పద్మరాగము, 3. ఇంద్రనీలము, 4. వజ్రము, 5. ముత్యము, 6. పుష్యరాగము, 7. పగడము, 8. వైడూర్యము, 9. మరకతము ఇవి నవరత్నములు.

పంచపల్లవములు : మఱ్ఱి, మేడి, మామిడి, రావి, జువ్వి చెట్ల లేత చివురుటాకులు.

పంచత్వక్కులు : పై చెట్ల బెరడు.

## * యుగాదిః *

శ్లో॥ చైత్రేమాసి జగద్బ్రహ్మ ససర్జ ప్రథమేఽహని ।
శుక్ల పక్షే సమగ్రంతు తదా సూర్యోదయే సతి । (చతుర్వర్గ చింతామణిః)

శ్లో॥ వత్సరాదౌ వసంతాదౌ

తా॥ బ్రహ్మ దేవుడు చైత్రమాస శుక్ల పక్ష ప్రతిపత్ (పాడ్యమీ) తిథియందు సూర్యోదయ కాలమున ఈజగత్తును సమగ్రముగా సృజించెను. అదియే మన ఉగాది ! వత్సరమునకు మొదటి దినము, వసంత ఋతువు మొదటి దినమే ! ఉగాది!

ఉత్సవము :

సవమ్ సాంసారికమ్ దుఃఖ ముత్తరన్తి తదంబుధిమ్ ।
యస్మార ఇతి విద్వాంసో నిర్బ్రువ న్యుత్సవాహ్వయమ్ ।

తా॥ సంసార దుఃఖ సముద్రమునుండి ఒడ్డుకు చేర్చి కాపాడునది ఉత్సవము.

# * శ్రీ రామ నవమీ నిర్ణయమ్ *

అగస్త్య సంహిత అష్టా వింశతి అధ్యాయములో నిట్లున్నది.

శ్లో॥ నవమీ చా ఽ ష్టమీ విద్ధాత్యాజ్యా విష్ణు పరాయణైః ।
ఉపోషం నవమ్యాతంతు దశమ్యామేవ పారణమ్ ।
పునర్వసు ఋక్ష సంయోగే స్వల్పేపి యది దృశ్యతే ।
చైత్రశుద్ధ నవమ్యాంతు సా పుణ్యా సర్వకామదా ॥

తా॥ విష్ణుభక్తి పరాయణులయినవారు అష్టమితో కూడిన నవమిని వదలివేయవలెను. నవమి నాడు ఉపవాసము చేసి దశమినాడు పారణ మాచరింపవలెను. పునర్వసు నక్షత్రము కలా మాత్రము ఉండినను చైత్ర శుద్ధ నవమి అన్ని కోర్కెలను తీర్చి పుణ్యమును కల్గించును.

**ప్ర : శ్రీ రామ నవమి జన్మతిధి కదా ? ఆనాడు కల్యాణము చేయుట శాస్త్ర సమ్మత మగునా ?**

స : శ్రీ **పురుషోత్తమ** సంహితయందు చతుర్వింశతి అధ్యాయమున (౨౪, ౨౫, ౨౬ శ్లో) నిట్లున్నది.

శ్రీ భగవానువాచ-

శ్లో॥ అధ శ్రియాది దేవీనామ్ పాణిగ్రహణముత్తమమ్ ।
కధ్యతే శ్రుణు తత్సర్వమ్ సావధానేన చేతసా ।

శ్లో॥ యస్యశ్రవణ మాత్రేణ జన్మ సాఫల్య మాప్నుయాత్ ।
★ యస్యావతార దివసే తస్య కల్యాణ మాచరేత్ ॥
అవతారేషు సర్వేషు అనుక్తేజన్మతారకే ।
చైకాదశ్యాం ప్రకుర్వీత కల్యాణమ్ భక్తిభావతః ॥
జగత్కల్యాణ సిద్ధ్యర్థం ప్రత్యబ్దం కారయేత్సవమ్ ।

తా॥ భగవానుడు బ్రహ్మకు తెలుపుచున్నాడు-

శ్రీదేవి మున్నగు స్త్రీ దేవతల పాణిగ్రహణము శ్రేష్ఠమయినటువంటిది : దాని నంతటినీ చెప్పెదను : నీవు సావధానుడవై వినవలసినది, పాణి గ్రహణము



శ్రీదేవి మున్నగు దేవతలకు చేసిన (లేక వినిన మాత్రముననే) జన్మ సాఫల్యత కలుగును :

★ ఎవరి జన్మదినమునందు వారి కల్యాణము ఆచరింప వలసినది. జగత్ కల్యాణమునకై ఏటేటా కల్యాణోత్సవము జరుపవలెను. జన్మనక్షత్రము చెప్పబడక పోయినచో, ఏకాదశీతిథియందు భక్తితో తప్పక చేయవలెను.

**మంగళ సూత్రధారణ మంత్రము :**

(శ్రీవిష్ణు తిలకే)

మంగళమ్ భగవాన్ విష్ణుః మంగళమ్ మధుసూదన ।
మంగళమ్ పుండరీకాక్షో మంగళమ్ గరుడధ్వజ ॥

ఈమంత్రముతోడనే తప్పక మంగళ సూత్రమును శ్రీస్వామివారి కుడిచేతికి తాకించి, భక్తితో 'నేను మీకు దాసుడను !' అని నమస్కరించి శ్రీదేవికి మెడయందు పైమంత్రముతో ధరింపజేసి మరల నమస్కరింప వలెను.

# * శ్రీ నృసింహ జయన్తీ *

శ్లో॥ వృషభేస్వాతి నక్షత్రే । చతుర్దశ్యాం శుభేదినే ।
సంధ్యా కాలేన సంయుక్తే । స్థంభోద్భూతో నృకేసరీ ।

తా॥ సూర్యుడు వృషభరాశిలో చేరిన తరువాత స్వాతీ నక్షత్రం శుక్ల పక్ష చతుర్దశియందు ప్రొద్దుక్రుంగు నపుడు స్థంభమునుండి శ్రీ నృసింహస్వామి జన్మించెను. చాంద్ర **మానము వారు వైశాఖ శుక్ల మిగులు చతుర్దశీతిథి యందేచేయవలెను.**

**★ చైత్ర మాసమున శ్రవణ నక్షత్రం శ్రీ నరసింహ జయన్తీ అనియునూ,**

**★ వైశాఖమున అనూరాధయందు శ్రీ హనుమజ్జయన్తీ అనియు (పాద్మంలో) కలదు.**

# * శ్రీ కృష్ణ జననకాల నిర్ణయ ప్రమాణవచనము *

**★ హరివంశ పూర్వభాగము నందలి ౫౯వ అధ్యాయమున నిట్లున్నది.**

యోగమాయాం ప్రతి విష్ణూక్తిః :

శ్లో॥ తతోఽహం సంభవిష్యామి దేవకీ జఠరే శుభే ।
గర్భేత్వయా యశోదాయా గంతవ్య మవిలంబితమ్ ।

ప్రావృట్కాలేచ నభసి కృష్ణాష్టమ్యా మహం నిశి ।
ఉత్పత్స్యామి నవమ్యాంచ ప్రసూతిం త్వమవాప్స్యసి ॥

ఈశ్లోక ద్వయమునందు "ప్రావృట్కాలే" అనుదాని వలన వర్షర్తువనియు, "నభసి" అనుదాని వలన శ్రావణ మాసమనియు "కృష్ణాష్టమ్యాం నిశి" అనుట వలన కృష్ణపక్ష అష్టమినాటి నడిరేయి యనియు శ్రీకృష్ణావతార సమయము తెలియ బడుచున్నది.

మఱియు "నవమ్యాంచ ప్రసూతిమ్ త్వమవాప్స్యసి" అను వాక్యార్థమును వక్ష్యమాణ హరివంశ గ్రంథోదాహృత ప్రమాణ వచనస్థమగు "యామేవ రజనీం కృష్ణో జజ్ఞే వృష్ణికులే ప్రభుః । యమేవ రజనీం కన్యాం యశోదా దేవ్య జాయత" అను వచనార్థంబును సమరస పెట్టి చూడగ నవమీ విద్ధగల యష్టమి శ్రీకృష్ణ జననతిధి యని తెలియబడు చున్నది. కృష్ణజనన తిథి శాస్త్రప్రమాణము ననుసరించి నవమి !

★ ఈ నిర్ణయము వెస్టువార్డు అండ్ కంపెనీ వారిచే 1934 సం॥ ప్రచురింపబడిన శ్రీ మన్మహా భాగవతము నందలి ఉపోద్ఘాతమున బ్రహ్మ శ్రీ పురాణమ్ హయగ్రీవ శాస్త్రుల వారిచే వ్రాయబడినది. వావిళ్లవారి ప్రచురణమున గూడ నిల్వేయున్నది.

## ❋ శ్రీకృష్ణ జయన్తీ ❋

(శ్రీపురుషోత్తమే – ౨౭ అ) – కృష్ణజయంతీ –

శ్లో॥ శ్రావణే కృష్ణపక్షేతు రోహిణ్యా మష్టమీ తిథౌ ।
శ్రీకృష్ణ భగవజ్జన్మదినే శౌరిమ్ సమర్పయేత్ ౧౭

శ్లో॥ శ్రావణేమాపి కృష్ణేచ పక్షేఽష్టమ్యామ్ తిథౌ హరేః ।
రోహిణ్యామ్ జన్మ కృష్ణస్య లోకానామ్ మఙ్గళావహమ్ ॥ ౩౦
'జయన్తీ' నామ సాప్రోక్తా జయత్య శుభమిత్యసౌ ।
మధ్యరాత్రే తతత్తస్మిన్ కళ్యాణమ్ సర్వమాచరేత్ ॥ ౩౧
తిథ్యయోగేఽపి నక్షత్రే కేవలేఽర్చన మిష్యతే ।
దేవస్య దేవకీ సూను రపరేద్యుర్మహోత్సవః ॥ ౩౨



తా॥ శ్రావణమాస కృష్ణపక్ష అష్టమీ రోహిణీ నక్షత్రయుక్త దినమున దేవకీ దేవి గర్భమునుండి లోకములకు మేలు చేయుటకు శ్రీకృష్ణ పరమాత్మ జన్మించెను. ఆ దినమును శ్రీజయన్తీ అని ప్రసిద్ధికెక్కినది. ఆనాటి అర్ధరాత్రి స్వామిని అర్చించి; కల్యాణ మహోత్సవముకూడా జరిపి మరునాడు మహోత్సవ గ్రామోత్సవములు చేయవలెను. తిథి అష్టమివెళ్లి నవమి వచ్చిననూ రోహిణీ నక్షత్ర మిగులు దినమున శ్రీకృష్ణ జయన్తీ ఉత్సవమాచరింప వలెను.

ముఖ్యం : సప్తమి కలవని అష్టమి కృత్తిక కలవని రోహిణి జయన్తి అర్చనకు ముఖ్యము. (మహోన్నత శాస్త్రప్రమాణములకు. నేను వ్రాసిన 'శ్రీకృష్ణ జయన్తీ' గ్రంధమును చూడండి) చాంద్రమానము వారు శ్రావణ కృష్ణ నవమీ వేధకలిగిన అష్టమియందు కానీ, పూర్ణ అష్టమియందుకానీ తప్పక చేయవలెను. కృత్తిక వేధలేని రోహిణి ప్రాధాన్యము !

## ❋ విజయ దశమీ ❋

శ్రీ పాంచరాత్రే : కశ్యప వచనమ్

శ్లో॥ ఉదయే దశమీ కించిత్ । సంపూర్ణైకాదశీయది ।
శ్రవణర్క్షంతు యదాకాలే । సాతిథి ర్విజయాఽభిదా ॥

ప్రొద్దుపొడుపున దశమి కొద్దిమాత్రము కలిగి సంపూర్ణముగా ఏకాదశీ తిధి ఉండినప్పటికినీ; శ్రవణ నక్షత్రము సాయంకాలము (శమీపూజ కాలము) వరకును ఉన్నరోజునకు మాత్రమే "విజయ" అనుపేరు కలుగును. (వేరొక దానికి ఆ పేరు లేదు) అదియే నిజమగు విజయదశమి.

1. శ్రీ సీతోఽపనిషత్‌లో శ్రీవీరలక్ష్మీదేవి పరమ దివ్య వైభవము మనోహరముగా – మృదు – మధుర రసమయ వాక్కులతో వర్ణితమై యున్నది. (సీతోఽపనిషత్ చూడుడు!)

2. శ్రీవాల్మీకి మహర్షిగా లోకమున ప్రాచుర్యము పొందిన శ్రీప్రాచేతసుని ఆదికావ్యమగు శ్రీమద్రామాయణ – అద్భుత ఉత్తరకాండ యందు గల శ్రీసీతా సహస్రమునందు ౫౦౮ శ్లోకమున.

శ్లో॥ మహానుభావ మధ్యస్థా మహామహిష మర్దినీ ।
పద్మమాలా పాపహరా విచిత్ర ముకుటాననా॥

అని మహిషాసురమర్దనియగు శ్రీవీరలక్ష్మి స్వరూపిణిగా శ్రీసీతామాత స్తుతింపబడినది !

(3) శ్రీవీరలక్ష్మియే 'మహిషాసురుని' వధించినదని శ్రీరుద్రయామళము నందలి ఘట తంత్రమున శ్రీమహాలక్ష్మి సూక్తమున 18వ పటలంలో వర్ణింపబడినది.

(4) శ్రీవీరలక్ష్మిదేవిని నవరాత్రములయందు విధిగా వైష్ణవులు అర్చింపవలెను (నేను వ్రాసిన 'విజయదశమీ' శాస్త్ర ప్రమాణ గ్రంథమును చూడండి!.)

## * శ్రీ వీరలక్ష్మి ఉత్సవము *

శ్రీ పాంచరాత్ర దివ్యాగమ సంహితలయందు 'రత్నత్రయమ్' అని భగవద్ రామానుజునిచే కీర్తింపబడిన సాత్త్వత - జయాఖ్య - అహిర్బుధ్న్య సంహితల యందు ప్రధమ సంహితయగు శ్రీసాత్వతసంహితకు వ్యాఖ్యారూపమగు శ్రీ ఈశ్వర సంహిత యందు మహిషాసుర మర్దని యగు శ్రీవీరలక్ష్మిదేవి వైభవము; అర్చనయు విపులముగా వర్ణింపబడియున్నది.

(శ్రీ ఈశ్వరే - 7వ అధ్యాయే)

శ్లో॥ శ్రీవత్సగాయోగలక్ష్మి; భోగలక్ష్మిస్తు పార్శ్వగా॥
వీరలక్ష్మి పృథక్. స్థానే స్వాతంత్ర్యేణ ప్రతిష్ఠితా॥

శ్లో॥ ఏవ మన్యాస్తు దేవీషు రూపత్రయ ముదాహృతమ్॥
యోగలక్ష్మి; భోగలక్ష్మ్యోర్దేవేన సహపూజనమ్॥

శ్లో॥ వీరలక్ష్మి పృథక్ గేహే పూజయేత యథావిథి

తా॥ శ్రీమన్నారాయణుని వక్షఃస్థలమున విరాజిల్లెడు పుట్టుమచ్చ పేరు – 'శ్రీవత్సము'! దానియందు ఆటపట్టుగా ఉండెడు జగన్మాతలు యోగలక్ష్మి భోగలక్ష్ములు ! వారిరువురునూ శ్రీమన్నారాయణునకు (ఉభయ) పార్శ్వవర్తినులుగా వేంచేసి స్వామితో పాటు భక్తులను కటాక్షించుచున్నారు. వారినే మనము ఇపుడు శ్రీదేవీ - భూదేవీ అనుచున్నాము. శ్రీయోగలక్ష్మి - భోగలక్ష్మిదేవులను స్వామివారితో కలిపి ఒకే గర్భమందిరమున ప్రతిష్ఠించి - అర్చింపవలెను !

ఇప్పుడు కొత్తగా కట్టినవైననూ – పురాతన నిర్మాణములైననూ ఆగమశాస్త్ర బద్ధముగా నిర్మించిన విష్ణ్వాలయములందు స్వామి గర్భగృహమునకు కుడివైపు స్వతంత్రాలయము నిర్మించి - శ్రీవీరలక్ష్మిదేవిని తప్పక ప్రతిష్ఠ జరుపబడి యుండును. ఆ తల్లినే నేడు మనము రాజ్యలక్ష్మి దేవిగా పిలుచుచున్నాము. యదార్థమునకు ఆగమశాస్త్ర ప్రమాణ ప్రకారము ఆమెయే శ్రీ వీరలక్ష్మిదేవి ! స్వామి అర్చన జరిగిన వెనువెంటనే శ్రీసూక్తము నందలి 15 ఉపచారములతో విధిగా ఈమెను భక్తి - శ్రద్ధలతో అర్చింపవలెను.

**శ్రీ లక్ష్మి తంత్రమునందు – 9 అ 8 శ్లో.**

శ్లో॥ మహాలక్ష్మి రహమ్ శక్ర ! పునః స్వాయంభువేఽన్తరే।
హితాయ సర్వలోకానామ్ జాతామహిషమర్దనీ॥

శ్లో॥ మదీయా శక్తిలేశా యే తత్తత్ దేవ శరీరగాః।
సంభూయతే మమాఽభూవన్ రూపమ్ పరమ శోభనమ్॥

శ్లో॥ ఆ యుధానిచ దేవానామ్ యాని యాని సురేశ్వర।
తచ్ఛక్తయ స్తదాకారా ఆయుధాని మమాభవన్॥

శ్లో॥ అభిష్టుతా సురైః సాఽహమ్ మహిషమ్ జఘ్నుషీ క్షణాత్।

తా॥ ఓ ఇంద్రా ! నేను స్వాయంభువ మన్వంతరములో సర్వలోకముల క్షేమము కొఱకు మహిషమర్దనిగా అవతరించి, వానిని వధించాను. దేవతల కోరిక మేరకు నేను, లోకభయంకరుడు - క్రూరుడయిన మహిషుని క్షణమాత్రమున సంహరించి సర్వజగత్తులకునూ శాంతినీ, మేలునూ ప్రసాదించాను. నా శక్తిలో లేశమాత్రము నాదయచే పొందినవారు నీవంటి స్వర్గాధిపతులుగా రూపొందినారు ! పరమ శోభనమైన నారూపము నుండి దేవతల దేహములకునూ, ఆయుధములకునూ పరాక్రమ-పటుత్వములు కల్గినవి ! అనితెల్పినది - శ్రీవీరలక్ష్మిదేవి !

శ్రీ ఈశ్వరే – 13 అ 60 శ్లో

శ్లో॥ అథ చాఽశ్వయుజే మాసి కర్తవ్యమ్ సర్వ సిద్ధిదమ్।
వీరలక్ష్మ్యుత్సవ విధిమ్ వక్ష్యామి మునిసత్తమాః॥
తస్మిన్ మాసి సితే పక్షే హ్యష్టమీ కలయాఽపివా।
అవిద్ధాయామ్ నవమ్యాంతు శ్రీదేవ్యుత్సవ మాచరేత్॥

శ్లో॥ అథ చాఽశ్వయుజేయాసి వీరలక్ష్మ్యోత్సవమ్ చరేత్।
ప్రతిపద్దిన మారభ్య నవాహోత్సవ మాచరేత్॥
సంస్నాప్య కలశైర్నిత్యమలంకృత్యతు దేశికః।
చతుః స్థానార్చనమ్ కృత్వాహవిరంతమ్ ప్రపూజ్యచ

యానేదేవీమ్ నమారోప్య దేవమ్ గ్రామప్రదక్షిణమ్
ఏవమ్ ప్రతిదినమ్ కృత్వా నవమ్యాం కుంభ తోయతః
ప్రోక్షయేన్నిత్య పూజాంతే దేవీమ్ దేవేన పూజయేత్।

శ్రీ లక్ష్మీహృదయమునందు

అథర్వణ రహస్యమున ఉత్తర భాగము నందు శ్రీమహాలక్ష్మీహృదయ స్తోత్రము.

శ్లో॥ య ఆశ్వయుజేమాసి శుక్లపక్షే రమోత్సవే।
పఠేత్తదైకోత్తర వారవృద్ధ్యాలభేత సౌవర్ణ మయీం సువృష్టిమ్ ।

తా॥ శ్రీవీరలక్ష్మీదేవి మహోత్సవము నందు ఆశ్వీయుజమాస శుక్లపక్షమునందు ఎవరు ఈ మహాలక్ష్మీ హృదయస్తోత్రము పలుమారులు భక్తియుక్తులై పఠింతురో ? వారికి సకల సంపదలునూ సమృద్ధిగా లభించును.

మొదటినాడు ఒకసారి ..... 9వనాడు తొమ్మిదిసారులు ఈ మాదిరిగా ఎన్నిదినములో అన్నిమారులు పఠింపవలెను.

## ❋ శ్రీ మహాలక్ష్మీసూక్తము ❋

( శ్రీ రుద్రయామళే - - ఘటతంత్రే - దేవీ మాహాత్మ్య - అష్టాదశ పటలః)

అస్య శ్రీమహాలక్ష్మీ సూక్తమహామంత్రస్య - విష్ణుః ఋషిః - అనుష్టుప్ ఛందః శ్రీమహాలక్ష్మీ ర్దేవతా - శ్రాంబీజమ్ - హ్రీమ్ శక్తిః - హ్రూమ్ కీలకమ్ - శ్రీమహాలక్ష్మీ ప్రీత్యర్థే జపే వినియోగః అంగన్యాసానంతరమ్ భూర్భువస్సువరోమ్ ఇతి దిగ్బంధః

ధ్యానమ్ :

వందే ! లక్ష్మీమ్ పరశివ మయీమ్ తప్తజాంబూనదాఽభామ్।
తేజోరూపామ్ కనకవసనామ్ సర్వభూషోఽజ్జ్వలాంగీమ్।
బీజాపూరామ్ కనక కలశమ్ హేమపద్మమ్ దధానామ్।
ఆద్యామ్ శక్తిమ్ సకలజననీమ్ విష్ణువామాఽంక సంస్థామ్।
లం ఇత్యాది పంచ ఉపచారాన్ కుర్యాత్।

ఋషి రువాచ :

భూయః శృణు మహాభాగ ! దేవీ మాహాత్మ్యముత్తమమ్।
... పురాగాయ హరిః ప్రోఽవాచ విశ్వకృత్



విష్ణు రువాచ :

పరామ్ పరేశామ్ జగదాది భూతామ్ వరామ్ వరేణ్యామ్ వరదామ్ వరిష్ఠామ్
పరేశ్వరీమ్ తామ్ విబుధైః ప్రగీతామ్ త్వామ్ విశ్వయోనిమ్ శరణమ్ ప్రపద్యే 1
శ్రియమ్ సమస్తై ర్నిధివాసభూతామ్ శ్రీమహాలక్ష్మీమ్ ధరణీమ్ ధరాణామ్।
అనాది మాదిమ్ పరమార్థరూపామ్ త్వామ్ విశ్వయోనిమ్ శరణమ్ ప్రపద్యే 2
ఏకామనేకామ్ వివిధామ్ సుకార్యామ్ సకారణ సదసద్రూపిణీచ।
కల్యాణ రూపాంచ శివామ్ శివప్రదామ్ త్వామ్ విశ్వయోనిమ్ శరణమ్ ప్రపద్యే3
సర్వాశ్రయామ్ సర్వజగన్నివాసామ్ శ్రీమహాలక్ష్మీమనాదిదేవీమ్।
శక్తి స్వరూపామ్ చ శివ స్వరూపామ్ త్వామ్ విశ్వయోనిమ్ శరణమ్ ప్రపద్యే 4
కామాఽభిధామ్ శ్రీమధివాసభూతామ్ హ్రీమ్ రూపిణీమ్ మన్మథ బీజయుక్తామ్
కళాఢ్య బీజామ్ పరమార్థ సంజ్ఞామ్ రమామ్ విశాలామ్ కమలాధి వాసామ్ 5
వైశ్వానర శ్రీ సహితేన దేవీమ్ శ్రీమంత్రరాజేన వైరాజమానామ్।
సర్వార్థ దాత్రీమ్ పరమామ్ పవిత్రామ్ త్వామ్ విశ్వయోనిమ్ శరణమ్ ప్రపద్యే6

శ్రీ మహాలక్ష్మీ యంత్ర స్వరూపమ్

త్రికోణసంచార యుగ ప్రభావామ్ షట్కోణ మిశ్రామ్ ద్విదశార సంయుతామ్
అష్టారచక్రాధి నివాసభూతామ్ త్వామ్ విశ్వయోనిమ్ శరణమ్ ప్రపద్యే 7
పునర్దశార ద్వితయేన సంయుతామ్ ద్విపంచ కోణాంకిత భూగృహాంచ।
యంత్రాధివాసామధి యంత్రరూపామ్ త్వామ్ విశ్వయోనిమ్ శరణమ్ ప్రపద్యే8
సంభావితామ్ సురైరపి ధ్యానగమ్యామ్ సర్వస్వరూపామపి సర్వసేవ్యామ్
సర్వాక్షర న్యాసవశామ్ వరిష్ఠామ్ త్వామ్ విశ్వయోనిమ్ శరణమ్ ప్రపద్యే 9
సృష్టిస్థితి ప్రళయాశ్చబీజై ర్న్యాసమ్ విధాయ ప్రజపంతియే త్వామ్।
తఏవ రాజేంద్ర నిష్పృష్టపాపావిద్యాధరాణామ్చ యశోలభంతే। 10
ప్రపూజ్య యంత్రమ్ విధినా మహేశీ న్యాసైశ్చ పూతాః చరమై స్సుభాగ్యాః।
జపంతియేత్వామ్ వివిధార్థ ధాత్రీమ్ తఏవ ధన్యాః కులమార్గనిష్ఠాః 11
జానంతియే పశవస్తే కుపాపా బ్రహ్మాఽది గీతమ్ మహితమ్ మహేశి।
కేచి న్మహాంతో నిజధర్మలాభాః జానంతి తేదేవి పరమ్ సుధామః 12

విధాయకుండమ్‌విధి స్థండిలమ్ వా సౌగంధి హోమమ్ సకలమ్‌చకుర్య
తత్తోషణా జ్ఞాయతే భాగ్యతంత్రమ్ తేషామ్ సురైశైరపి దూరగమ్యమ్ 13
పునస్తువంతి ప్రయతాశ్చదేవీమ్ స్తోత్రైరుదారైకులయోగయుక్తాః ।
త ఏవ ధన్యాః పరమార్ధ భాజోభోగశ్చ మోక్షశ్చకులేఽస్తితేషామ్ 14

ఋషి రువాచ ః

ఇతిస్తుత్వాఽవసానేన మహాలక్ష్మీమ్ దదర్శసః 15
చతుర్ భుజామ్ త్రినయనామ్ మహిషాఽసురఘాతినీమ్

అథ శ్రీమహాలక్ష్మీః ప్రసన్నాస్తుతి గౌరవాత్ ।
ఉవాచ స్మిత శోభాఢ్యా నారాయణ మజమ్ విభుమ్ 16

శ్రీ దేవ్యువాచ ః

వరమ్ వరయ దేవేశ ! నారాయణ ! సనాతన !
దాస్యామ్యదాతవ్య మపి తవ భక్త్యావశీకృతా॥ 17

శ్రీ హరి రువాచ ః

మాతః ! పరమ కళ్యాణి ! మహాలక్ష్మి ! వరప్రదే !
కులాఽచారే మనోమేఽస్తు దృఢం తే కృపయా శివే॥ 18
తవ సూక్తమ్ తు సఫలమ్ ప్రీతికారకమ్ ।

శ్రీ దేవ్యువాచ ః 19

ఏవ మస్తు ! మహాభాగ ! నారాయణ ! సనాతన !
సూక్త మేత ద్వినాయస్తు పఠేత్ సప్త శతీమ్ నరః 20
సయాచ్యతి మహాఘోరమ్ నరకం దారుణమ్ బిలమ్
లభ్యతే వరమామ్ వ్యాధిమ్ మమ కోప విఘూర్ణితః । 21
★ లక్ష్మీ సూక్తమ్ పఠేద్యస్తు పూర్ణస్తోత్రమ్ భవేదిదమ్ ।
★ లక్ష్మీసూక్తమ్ వినా సప్తశతీస్తోత్రమ్ నసిద్ధ్యతి ।

ఋషి రువాచ

ఏవముక్త్వా వచో దేవీ తూష్ణీ భావమ్ గతా నృప ।

శ్రీ (మహా) లక్ష్మీ సూక్తమ్ సంపూర్ణమ్



# ✻ గ్రహణ విషయము ✻

శ్రీ ప్రశ్న సంహితాయామ్ ప్రాయశ్చిత్త కాండే

శ్లో॥ పురస్తాశ్చ పరస్తాశ్చ గ్రహణే చంద్ర-సూర్యయోః ।
ద్వినాడికామ్ పరిత్యజ్య నిత్యపూజామ్ ప్రకల్పయేత్ ।
మహోత్సవా ద్యుత్సవేషు ద్విముహూర్తమ్ పరిత్యజేత్ ।

తా॥ చంద్ర; సూర్య గ్రహణములు సంభవించినపుడు, పట్టకముందు 48 నిమిషములు, విడచిన తరువాత 48 ని॥లు విడచి నిత్యపూజలు జరుపుకొనవలెను. కల్యాణోత్సవ పవిత్రోత్సవ; అధ్యయనోత్సవములు మొదలయిన వాటియందు ః

గ్రహణ కాలమునకు ముందు 96 నిమిషములు విడచిన తదుపరి 96 నిమిషములు వదలి తర్వాత దేవ కార్యమును యథావిధిగా, నెరవేర్చుకొనవలెను. (ఈ విషయములు శ్రీ ప్రశ్న సంహితలో వున్నవి).

పరిభాష ః నాడి - 1 గడియ (24 నిమిషములు) ముహూర్తము - 2 గడియల కాలము (48 నిమిషములు) హోర - 1 గంట.

# ✻ మౌఢ్య - గ్రహణ దోషములు లేని చోట్లు ✻

శ్లో॥ గోదావర్యాం - గయాయాంచ శ్రీశైలే గ్రహణద్వయే ।
సురాఽసుర గురూణాంచ మౌఢ్యదోషా నవిద్యతే ।

తా॥ గోదావరీ తీరము ; గయక్షేత్రము ; శ్రీశైలము ఈమూడు స్థలములునూ మిక్కిలి పవిత్రమైనవి. సూర్య ; చంద్రగ్రహణ సందర్భమైననూ, గురు, శుక్ర మౌఢ్యములైననూ పైచోటుల యందు నిరాటంకముగా సకల శుభకార్యములూ నెఱవేర్చుకొనవచ్చును.

# ✻ పుణ్యాహవాచనము ✻

ప్ర ః భగవదాలయముల యందు ఏ పుణ్యాహవాచనమాచరింప వలెను ?

స ః వాసుదేవ పుణ్యాహవాచనము చేయవలెను-మానుష పుణ్యాహవాచనము దేవ సన్నిధియందు చేసిన ఆలయమున భగవంతుడు నివసింపడు.

శ్లో॥ వాసుదేవాఖ్య పుణ్యాహం । వాచయే ద్దేవ సన్నిధౌ ।
మానుషం యది పుణ్యాహం । మందిరం శూన్యతాంవ్రజేత్ । (విష్ణుతిలకే)

## * ఊర్ధ్వపుండ్రము *

శ్లో॥ యజ్ఞో దానం జపోహోమ । స్వాధ్యాయః పితృకర్మచ ।
వృధా భవతి విప్రేంద్ర । ఊర్ధ్వ పుండ్ర వినాకృతమ్ ॥ (బృహన్నారదీయే)

శ్లో॥ ఊర్ధ్వంచ తిలకం కుర్యాత్ దైవే పిత్ర్యేచ కర్మణి । (వృద్ధపారాశర్యే)

శ్లో॥ ఊర్ధ్వ పుండ్రం ద్విజాతీ నామ్ అగ్నిహోత్ర సమో విధిః । (నిర్ణయసింధౌ)

శ్లో॥ పూజా కాలేచ హోమేచ సాయం ప్రాత ర్ద్వి జాతయః ।
నామాన్యుచ్చార్య విధినా ధారయే దూర్ధ్వ పుండ్రకమ్ ॥

శ్లో॥ ఊర్ధ్వ పుండ్రం మృదాశుభ్రం । లలాటే యస్య దృశ్యతే ।
చండాలోఽపి విశుద్ధాత్మా । పూజ్యఏవ న సంశయః ॥
**(పరాశరస్మృతౌ – ఆచారకాండే ౧ అధ్యాయే)**

శ్లో॥ స్నాత్వామృత్తికయా చోర్ధ్వపుండ్రం కుర్యాత్ ।
జపకాలే మృదా కుర్యాత్ – సంధ్యాకాలేచ వారిణా ।
భస్మనా హోమకాలేతు – చందనం సార్వకాలికమ్ ॥
**(యాజుష పూర్వ ప్రయోగ చంద్రికా)**

ఊర్ధ్వ పుండ్రము ధరించునపుడు చదువుకొను శ్లోకము.

శ్లో॥ గోపీచందన ! పాపఘ్న ! విష్ణుదేహ సముద్భవ !
చక్రాంకిత ! నమస్తుభ్యం ధారణాన్ముక్తిదోభవ !
అగ్నినావై హోత్రా త ప్తం చక్రం ద్విభుజేద్ధార్యమ్ ॥
అధ ఊర్ధ్వపుండ్రమాలిఖేత్ తస్మాద్విరేఖంభవతి । పునరాగమనం, న బ్రహ్మణ స్సాయుజ్య స్సలోకతా మాప్నోతి।**(కాణ్వవేదే – శతపథ బ్రాహ్మణే)**

తా॥ బ్రాహ్మణుడయిన వాడు సర్వకాలముల యందునూ ఊర్ధ్వ పుండ్రమును ధరింప వలెను ఊర్ధ్వ పుండ్రమును ధరించినవారు. తిరిగి జన్మ మెత్తుపనిలేదు. పునరావృతిరహిత శాశ్వత వికుంఠధామమున నిత్యసూరులై యుందురు. ఊర్ధ్వపుండ్రమును ధరించిన ఛండాలుడైననూ సర్వలోకస్తుతుడగును.



★ జపకాలమున మట్టితోనూ, సంధ్యావార్చునపుడు నీటితోనూ, హోమ సమయమున భస్మముతోనూ, ఎల్లపుడు శ్రీచందనముతోనూ ఊర్ధ్వపుండ్రమును మానవుడు ధరింపవలెను. ఊర్ధ్వపుండ్రము లేక చేయు కర్మల పుణ్య ఫలమంతయును నశించి పోవును.

## * ఏ వ్రేలితో బొట్టు పెట్టుకొనవలెను ? *

శ్లో॥ అంగుష్ఠః పుష్టిదః ప్రోక్తో, మధ్యమాయుష్కరీభవేత్ ।
అనామి కాన్నదా నిత్యం, ముక్తిదాచ ప్రదేశినీ ॥
ఏతై రంగుళి భేదైస్తు, కారయేత్ న నఖం స్పృశేత్ ॥

తా॥ ప్రతిదినము బొటవ్రేలితో ఊర్ధ్వ పుండ్రము పెట్టుకొనిన పుష్టి కలుగును; నడిమివ్రేలితో ఆయుర్ వృద్ధి; నాలుగవ వ్రేలితో భోజనమునకు లోటు లేకుండ చేయును; చూపుడు(౨వ) వ్రేలుతో ముక్తినిచ్చును. (చివరి వ్రేలితో పెట్టుకొనరాదు) బొట్టు పెట్టుకొనునపుడు గోరు తగులరాదు.

**ప్రః తిలలు – దర్భలు ఎట్లు జన్మించెను.** (ఆధారము శ్రీ భాగవతము)

సః భూదేవిని రక్షించుటకు శ్రీమన్నారాయణుడు యజ్ఞవరాహమూర్తియై హిరణ్యాక్షునితో పోరునపుడు హిరణ్యాక్షుడు ప్రయోగించిన ఐంద్ర । పాశుపత – బ్రహ్మ ప్రస్త్రముల వలన శ్రీ స్వామి రోమములురాలి భూమిపై బడగా అవి దర్భలాయెను. చెమట బిందువులు రాలి 3 రకముల(తెలుపు–నలుపు–మసర) వన్నెలుగల నువ్వులాయెను. దర్భలు పవిత్ర యజ్ఞములు; శుభకార్యములు; పితృ కర్మలకునూ తిలలు పితృ కర్మలకునూ పవిత్రతత కల్పించి, ఉత్తమ పుణ్యసంప్రాప్తికి సమర్ధవంతములాయెను.

## * దశవిధ దర్భలు *

**శ్రీ నారాయణ సంహితాయామ్ :**

శ్లో॥ కుశ–కాశ; యవా–దూర్వా–గోధూమ శ్చోద కుందురాః ।
ఉశీరా–వ్రీహయో–మౌంజా–దశదర్భాః పరికీర్తితాః ॥

శ్లో॥ పాదేశమాత్ర దర్భాణాం–ద్విఃప్రాదేశ కుశః స్మృతః ।
త్రిః ప్రాదేశస్తు బర్హిస్స్యాత్–తదూర్ధ్వం తృణం భవేత్ ॥

శ్లో॥ కుశైస్తు సంధ్యాకరణం-దర్భైస్తు పితృకర్మచ।
బర్హిషా యజ్ఞ కర్మాణి-శేషైస్తు గృహ గోపనమ్ ।

తా॥ కుశ, కాశ, యవ, దూర్వ, గోధూమ, ఉద, కుందుర, ఉశీర-వ్రీమి, మౌంజ అని పది విధములయిన దర్భలు కలవు. ★ ప్రాదేశపు పొడవుగల దానిని 'దర్భ' అనీ రెండు ప్రాదేశముల పొడవుగలిగిన 'కుశ' అనీ-మూడు ప్రాదేశముల పొడవు గలిగిన 'బర్హి' అనీ ; వానికన్న ఎత్తుగవున్నచో గడ్డిగాను పరిగణింతురు. 'కుశ' సంధ్యావందన సమయముననూ-'దర్భ' పితృ కర్మలయందునూ-'బర్హిష' యజ్ఞ కర్మల యందునూ, మిగిలిన దానిని ఇండ్లు కప్పుకొనుటకునూ ఉపయోగింతురు.

పరిభాష : ★ ఒక ప్రాదేశము అనగా బొటమన వ్రేలికి-చూపుడు వ్రేలికి నడుమగల కొంత(ఒక జిట్ట) ఎద్దు, లేక గుజ్జము గిట్టపొడవు; వితస్తి = 12 అం.

## ❋ వైకుంఠ ఏకాదశీ నిర్ణయమ్ ❋

౧. శ్రీ పారమేశ్వర సంహితాయాం ౧౭వ అధ్యాయే ౬౦౩ శ్లో

శ్లో॥ ఏకాదశ్యాం మార్గశీర్షే పూర్వపక్షే విశేషతః
కుర్యాద్విశేష యజనమ్ తత్ర సంశ్రావయే ద్విభుమ్
పదాగమ విదాన్ సర్వాన్ వేదాన్వైవేద ఘోషణం ।

౨. ఈశ్వర సంహితా ౨౧ వ అధ్యాయే -

శ్లో॥ ఉత్తరాయణ పూర్వేషు షట్ సంక్రాన్తిషుచద్విజాః
పశ్చాత్ షోడశనాడీ నామన్తరే దేవ మర్చయేత్।
దక్షిణాయన పూర్వేషు షట్సు సంక్రమణేషుచ।
ప్రాగేవాఽభ్యర్చయే ద్దేవంనాడీషోడశకాన్తరే ।

౩. పరమ పురుష సంహితలో 10వ అధ్యాయం 66-68 శ్లో

శ్లో॥ ధనుర్మాసే సితేపక్షే ఏకాదశ్యాం శ్రియః పతేః ।
వైకుంఠ పద పూర్వాయా ముత్సవం సమ్యగాచరేత్।



యది భూయాద్ ఏక మాసే ఏకాదశ్యాద్వయం బుధాః ।
తథాతు ప్రథమం త్యక్త్వా ద్వితీయే హ్యుత్సవం చరేత్ ।
యదా భూయా ద్వితీయస్సు వేధా సంక్రమణస్సచ ।
తదాతు ప్రథమేకుర్యాత్ శ్రీపతేస్తు మహోత్సవమ్ ।

౧. శ్లోక తాత్పర్యము :

మార్గశిర మాసంలో శుక్లపక్ష ఏకాదశి వైకుంఠ ఏకాదశీ ఉత్సవం చేయవలెను.

౨. శ్లో॥ తాత్పర్యము :

ఉత్తరాయణంలో వచ్చే 6 సంక్రమణములలో 16 నాడిలకు పిదప సంక్రమణోత్సవము చేయవలెను.

దక్షిణాయణంలో వచ్చే 6 సంక్రమణములలో 16 నాడిలకు ముందు సంక్రమణోత్సవము చేయవలెను.

౩. వ శ్లో॥ తాత్పర్యము :

ఎప్పుడైనను ధనుర్మాసములో మార్గశీర్ష, పుష్య శుక్ల ఏకాదశులు రెండునూ వుండుట సంభవించిన మొదటిదానిని వదలి, రెండవ దానియందు వైకుంఠ ఏకాదశీ ఉత్సవము చేయవలెను.

రెండవ ఏకాదశికి మకర సంక్రమణ వేధ సంభవించిన మొదటి (మార్గశిర శుద్ధ) ఏకాదశినే వైకుంఠ ఏకాదశియని తెలిసికొని ఉత్సవము జరిపించుట ఆగమ సమ్మతము.

పరిభాష : ★

నాడి = 1 గడియ (24 ని)

ముహూర్తము = 2 గడియలు (48 ని)

## ❋ తీర్థ విషయము ❋

ప్ర : పంచపాత్రలయందు వేనిని ఆవాహనము చేయవలెను ?

స : శ్రీమన్నారాయణ వామపాదాంగుష్ఠ జనిత అమృతఝురీ సమాన విరజానదీ తీర్థము-కామధేను దుగ్ధము. ఆవాహనము చేయవలెను.

ప్ర : తీర్థమనగా నేమి ?

స : పురుషసూక్తాది మంత్రములతో సాలగ్రామము (స్నాన బేరము) నకు స్నాన

మాడించిన తులసీదళ సహితమైన నీరు తీర్థ మనబడును. (ఈ తీర్థమును అర్చకస్వామి మున్ముందుగా తాను తీసికొని తదుపరి అధ్యాపక స్వాములకు, యజమానులకు, భక్తులకు వరుసగా నివ్వవలయును. అర్చకుడు ముందుగా తీర్థమును తీసికొనకపోయినచో అర్చనయంతయు నిష్ఫలమగును.)

**ప్ర : తీర్థ మెన్నిసారులు ఎట్లు తీసికొనవలెను ?**

స : ఉత్తరీయము రెండు మడతలు వేసి, ఎడమచేతి యందుంచుకొని దానిపై కుడిచేయి వుంచి, కుడిచేతి బొటనవ్రేలును నడిమి వేలిక్రింది కణుపున చేర్చి, విడివిడిగా మూడు మూరులు (మినపగింజమునుగు నంత) తీర్థమును అచ్యుతాయనమః అనంతాయనమః గోవిన్దాయనమః అనుచు బొట్టుక్రింద బడనీయక స్వీకరించ వలెను.

శ్లో॥ అచుత్యః కల్పవృక్షశ్చ, అనన్తః కామధేనవః ।
చిన్తామణిస్తు గోవిన్దో; నామత్రయ ముదీరితమ్ ।

శ్లో॥ ప్రధమందేహశుద్ధ్యర్థం-ద్వితీయం ఆత్మశుద్ధికమ్ ।
తృతీయం మోక్ష సిద్ధ్యర్థం సాలగ్రామ జలమ్ పిబేత్ ॥

**ప్ర : తీర్థ మెటులేర్పడును ?**

స : సాలగ్రామ శిల-శంఖము-చక్రము-తులసీదళము-పురుష సూక్తము(మొదలయిన మంత్రము) లతో తీర్థము ఏర్పడును.

ప్ర : తీర్థమును త్రాగి నెత్తిపై పెట్టుకొన వచ్చునా ?

స : **శాండిల్య సంహితా :**

శ్లో॥ సాలగ్రామ శిలా తీర్థమ్ పేయః జీవై ర్దినే దినే ।
మళుకేన పిబేత్తీర్థమ్ శేషమ్ శీర్ష్ణి సమావహేత్ ।

తా॥ సాలగ్రామమునకు స్నానము చేయించిన జలమే తీర్థము దానిని జీవులు నిత్యమూ(గోకర్ణాకృతి) హస్తముతో చూపుడువ్రేలును విడచి లోనికి పుచ్చుకొని మిగిలిన తీర్థమును శిరమున ధరింపవలెను. (తీర్థమును కూర్చొని తీసికొనరాదు)

శ్లో॥ జపౌషధ, హోమే చాఽచామే దంతధావనే ।
తర్జనీమ్ వర్జయే ద్ధీమాన్ విధినా పంచ కర్మసు ।



శ్లో॥ గోకర్ణాకృతి హస్తేన మాషమగ్న జలమ్ పిబేత్ ।

తా॥ జపము, హోమము, ఆచమన సమయముల యందును. ఔషధము స్వీకరించు నపుడును. తీర్థము పుచ్చుకొనునపుడును చూపుడువేలును తక్కిన వ్రేళ్ళతో కలుపక విడిగా వుంచవలెను చూపుడు వ్రేలును క్రిందికి దించి బొటనవ్రేలును నడిమి వ్రేలి క్రింది భాగమున జేర్చినచో ఆవుచెవి ఆకారము అఱచేతికి వచ్చును. దానిలో మినపగింజ మునుగునంత తీర్థమునే భక్తులు స్వీకరింప వలయును.

**తీర్థ స్వీకరణమ్ :** సంధ్యావందన సమయే - 'కుక్కుటాసనేన ఉపవిశ్య । ఆచమనమ్ కృత్వా । అని చెప్పబడినది. సంధ్యను ఉపాసించునపుడు గొంతుకు కూర్చొని ఆచమనము చేయవలెను. భగవానుని సన్నిధిలో అటుల చేయరాదు. సేవక భావముతో నిలుచుండియే తీర్థమును తీసి కొనవలెను.

## ❋ యోగపీఠము ❋

**అధిదైవతములు**

బ్రహ్మ-నారదుడు-సనక-సనందన-సనత్సుజాత-సనత్ కుమారులు; సదాశివుడు; వరుణుడు-వినాయకుడు; దుర్గ యోగపీఠమునకు అధి దైవతములు :

**ఆధారాది పద్మాన్తము**

౧. ఆధారశక్తి; ౨. మూలప్రకృతి; ౩. జగదాధార శ్రీ కూర్మ భగవాన్; ౪. ఆదిశేషుడు; ౫. భూలోకము; ౬. శ్రీవైకుంఠలోకము; ౭. శ్రీవైకుంఠ దేశము; ౮. శ్రీవైకుంఠ నగరము; ౯ శ్రీవైకుంఠ విమానము; ౧౦. ఆనందమయ మణ్డపము; ౧౧. అనంతుడు; ౧౨. ధర్మము; ౧౩. జ్ఞానము; ౧౪. వైరాగ్యము; ౧౫. ఐశ్వర్యము; ౧౬. అధర్మము; ౧౭. అజ్ఞానము; ౧౮. అవైరాగ్యము; ౧౯. అనైశ్వర్యము; ౨౦. పీఠరూప అనంతుడు; ౨౧. పద్మము.

## * వాస్తుదేవారాధన ఫలమ్ *

శ్లో॥ అనర్చితో వాస్తుదేవే కృతమ్ కర్మ అసురం భవేత్।
తస్మాత్ సర్వ ప్రయత్నేన వాస్తునాధమ్ సమర్చయేత్॥

తా॥ వాస్తు పురుషుని పూజింపని ఏ పని ఐనను రాక్షసకార్యమగును. కనుక వాస్తు పురుషుని విధిగా పూజింపవలెను.

## * వాస్తుపూజ – కాలము *

వాస్తుదర్పణే

శ్లో॥ వాస్తుపూజామ్ ప్రకుర్వీత గృహారంభే, ప్రవేశనే।
ద్వారాభివర్తనే చైవ త్రివిధేచ ప్రవేశనే॥
ప్రతి వర్షంచ, యజ్ఞాదౌ, తథా పుత్రస్యజన్మని।
వ్రత బంధే, వివాహేచ తథైవచ మహోత్సవే॥
జీర్ణోద్ధారే, తథాశల్యన్యస్తైచైవ విశేషతః।
వజ్రాఽగ్నిదూషితే, భగ్నే, సర్ప, చండాల వేష్టితే॥
ఉలూక వాసితే, సప్తరాత్రౌ కాకాధివాసితే।
మృగాధివాసితే, గో, మార్జాలాభినాదితే॥
వారణాఽశ్వాభిరుతే, స్త్రీణాం, యుద్ధాభిదూషితే।
కపోతక గృహవాసే మధూనాం నిలయే తథా।
అన్యాన్యైశ్చైవ మహోత్పాతై ర్దూషితే శాంతిమాచరేత్॥

తా॥ గృహారంభము, గృహప్రవేశము, ద్వారములు పెట్టుసమయము అపూర్వ ప్రవేశము, సుపూర్వప్రవేశము, ద్వంద్వా భయప్రవేశము, సంవత్సరం మొదటినాడు, యజ్ఞము మొదలిడునపుడు, పుత్రజననము, ఉపనయనము, వ్రత బంధనము, పాణిగ్రహణము, మహోత్సవములు, జీర్ణోద్ధరణము, భూమిలో శల్యములుపైకి తీసివేయునపుడు, ఇంటిపైపిడుగుపాటు, ఇల్లుకాలుట, ఇల్లుకూలుట, ఇంటియందు పాములు పుట్ట పెట్టుట, ఇంటిలో అయోగ్యులు ప్రవేశించుట, గుడ్లగూబ చేరుట, కాకి ప్రవేశించి ఏడు దినములు ఉండుట, మృగములు ఇంటిలోనికి వచ్చుట, ఆవు, పిల్లి ఏనుగు గుర్రము భయంకరముగా అఱచుట, బహిష్ఠ స్త్రీలు, పావురములు, తేనెతుట్టెలు కలిగి దూషితమయిన ఇంటియందు, అనేక ఇతర ఉత్పాతములు కలిగినపుడునూ ఇంటియందు శాంతి కల్గుటకు వాస్తునాధుని అర్చింపవలెను.



★ దేవతల కల్యాణోత్సవములయందు వాస్తుపూజ చేయరాదు. (పద్మ సంహిత)

## * బాహ్యాఽభ్యంతర పూజలు *

1 బాహ్యపూజ = సాకారపూజ 2 అభ్యంతర పూజ = మానసిక పూజ

ఈ రెండునూ ముఖ్యములే !

శ్లో॥ భగవన్ పుండరీకాక్ష; హృద్యాగంతు మయాకృతమ్।
ఆత్మాసాత్కురు దేవేశ; బాహ్యే స్త్వామ్ సమ్యగర్చయే॥

**ప్ర : భగవానుని ఆత్మయందు స్మరించిన ముక్తిరాదా ? బొమ్మలయందే పూజింప వలెనా?**

స : మానస పూజవలన – అభ్యంతర వాసనలు (మనసు నందలి చెడు ఆలోచనలు) బాహ్య (విగ్రహ పూజవలన బాహ్య వాసనలు (క్రియా–వాగ్రూపమగు చెడు నడతలు) మెల్ల–మెల్లగా తొలగి నశించును. బాహ్యాభ్యంతర పూజలు రెండును ఆవశ్యకములే-అందు వలననే అగమ శాస్త్రములు రెంటినీ విధించినవి. మెట్లు (బాహ్యపూజ) గడవనివాడు మేడపైకి (మానస పూజ) జేరుటెట్లు ?

శ్లో॥ నిర్ణుదత్యంతరాస్సర్వా, మానసోయాగ ఉత్తమః।
బ్రాహ్యాశయ విశుద్ధ్యర్థం, బాహ్యయాగో విధీయతే॥ (లక్ష్మీతంత్రే)

అదియునుగాక;. మండల బ్రహ్మోపనిషత్ నందు–

మం॥ తస్యనిశ్చింతాధ్యానమ్ । సర్వకర్త నిరాకరణ మావాహనమ్ । నిశ్చయజ్ఞాన మాసనమ్। ఉన్మనీభావః పాద్యమ్। సదామనస్క మర్ఘ్యమ్। సదాదీప్తి రపారామృత వృత్తి స్స్నానమ్। సర్వాత్మ భావనా గంధః। దృక్ స్వరూపాఽవస్థాన మక్షతాః। చిదాప్తిః పుష్పః। చిదగ్ని స్వరూపమ్ ధూపః। చిదాదిత్య స్వరూపమ్ దీపమ్। పరిపూర్ణ చంద్రామృత స్యైకీకరణమ్ నైవేద్యమ్। నిశ్చలత్వమ్ ప్రదక్షిణమ్। (దా) సోహమ్ భావో నమస్కారః। మౌనమ్స్తుతిః। సర్వ సంతోషో విసర్జనమితి – యఏవమ్వేద।

నారదు డిట్లు చెప్పినాడు :-

శ్లో॥ అగ్నౌ క్రియావతామ్ దేవో, దివి దేవో మనీషిణామ్ ।
ప్రతి మా స్వప్రబుద్ధానామ్, యోగీనామ్ హృదయే హరిః ॥

తా॥ కర్మిష్ఠు లగ్నియందును; మనీషావంతులు ఆకాశము నందును; జ్ఞానాధికులు విగ్రహములందును; యోగులు హృదయమునందును హరిని పూజింతురు; ఈ పూజలయందును మరి ౨ విధములు కలవు; అవి -

1. స్వార్థపూజ - తన యింటియందు తనకు; కుటుంబ సభ్యులకు ఆయురారోగ్య ఐశ్వర్యములు కోరి చేయునది.
2. పరార్థపూజ; యజమానికి; గ్రామము; దేశము; దేశాధిపతి; అన్ని లోకముల క్షేమము కోరి భగవదాలయమున అర్చకునిచే చేయబడునది - ఇది మొదటి దానికన్న మిక్కిలి ఉత్తమోత్తమము. మఱియును నిత్యము; నైమిత్తికము; కామ్యము అనునవి కలవు.

## * సాలగ్రామ విషయము *

శ్రీ విష్ణుతిలకే :

శ్లో॥ సాలగ్రామ శిలా యత్ర పూజ్యతే కమలాసన ।
తత్ క్రోశద్వయమ్ పుణ్యక్షేత్ర మిత్యవధారయ ॥
భిన్నావా-స్ఫుటితా-యద్వా చక్రయుక్తా శిలాయది ।
పూజనీయాఽప్రయత్నేన భుక్తి ముక్తి ఫలప్రదా ॥
నాఽవాహనం ప్రతిష్ఠా నశాంతి ర్నైవ నిష్కృతిః ।
దుగ్ధేన స్నాపయే బ్రహ్మన్ స్పర్శాద్యైః దూషితాయది ॥

తా॥ ఏ స్థానమున సాలగ్రామార్చనము జరుగుచున్నదో; దాని చుట్టుపట్ల ౨ (రెండు) క్రోసులు దూరమువరకు పుణ్యక్షేత్రమని తెలియుము! పగిలినను; సరియైనదైనను; లేక చక్రచిహ్నముగల ఏ శిలయైనను పూజించినచో వేరు శ్రమ లేకయే భుక్తి ముక్తి ఫలములు లభించును : ఈ సాల గ్రామమునకు ఆవాహనము-ప్రతిష్ఠ-శాంతులు చేయవలసిన అవసరము లేదు; (ఆవు) పాలతో



స్నపనము చేయించిన అపవిత్రత తొలగి సర్వశుభముల నొసగునని శ్రీమన్నారాయణుడు తన తనయుడైన బ్రహ్మకు చెప్పెను.

## * తర్పణములు *

దేవ-ఋషి-పితృ తర్పణములు

శ్రీ కపింజలే -

శ్లో॥ బ్రహ్మాదీన్ తర్పయేత్ పూర్వమ్ పుష్పతోయేన దేశికః ।
కుశయుక్తేన తోయేన ఋషీణామ్ తర్పయేత్ తతః ॥
పితౄణామ్ తిలయుక్తేన తర్పయామీతి తర్పయేత్ ।

తా॥ దేవతలకు పూవులతోడను; ఋషులకు దర్భలతోడను; పితృ దేవతలకు నూవుల తోడను నీటిని (తర్పణము కొఱకు) వదల వలయును. (ఇది కపింజల సంహితయందు గలదు)

## * ఆలయ సమీప మరణ విషయము *

ఈశ్వర సంహితాయమ్ ఏకోన వింశతి అధ్యాయే ప్రాయశ్చిత్త విధౌ ౧౯౪ శ్లో॥ నుండి:

శ్లో॥ గ్రామదౌ బ్రహ్మ వర్ణస్య మరణం సంభవేద్యది ।
గ్రామమధ్యగతో యావచ్ఛవస్తిష్ఠతివై ద్విజాః ॥
గ్రామస్య తావదాశౌచమ్ తథా గ్రామస్య పూజనమ్ ।
నకుర్యాతచ్ఛవే గ్రామాద్బహిర్నీతే మునీశ్వరాః ॥
సంప్రోక్ష్య సర్వతో గ్రామం పుణ్యాహోద్ఘోష పూర్వకమ్ ।
తతస్తు దేవదేవస్య నకుర్యాత్ పూజనాదికమ్ ॥
అరబ్ధే పూజనే విప్రాగ్రామశ్చే చ్ఛవ దూషితమ్ ।
ఆరభ్య పూజనమ్ శీఘ్రం కుర్యాత్ మంత్రేణ దేశికః ॥
ప్రాగ్వత్ గ్రామ ప్రోక్షణాంతే పునః పూజనమాచరేత్ ।
గ్రామే శూద్రాది మరణం సంభవే ద్యది వై తథా ।
అశౌచం గృహమాత్రస్య గ్రామాశౌచం న విద్యతే ॥

తత్రాః భగవద్గేహ సమీపే ద్విజ సత్తమాః ।
ఏకాదశధనుః చ్యోన్త శూద్రాది శవ దూషితే ।
నిష్కాప్య తచ్చవం పశ్చాత్కుర్యా ద్దేవస్య పూజనమ్ ।
పురాద్ గ్రామాద్యంగ తయా కుస్తేపి భగవద్ గృహే ।
అంతశ్శవం చేద్ గ్రామాద్యం నకుర్యా ద్దేవపూజనమ్ ।
**చతుశ్శతే బ్రాహ్మణైస్తు యుక్త గ్రామ పురాదికే ।**
**అంత శ్శవేపి నైవాస్తి గ్రామాశౌచం మునీశ్వరాః ।**
తత్రాపి భగవద్గేహ సమీపే చైక వీధిషు ।
శవస్తిష్ఠతి చే దేవానార్చయేత్ ప్రోక్షణాత్ పురా ।

తా॥ గ్రామాదులయందు బ్రాహ్మణులయందు మరణము సంభవించిన ఎడల గ్రామ మంతటికిని ఆశౌచము గనుక ఆలయమున పూజ జరిగించకూడదు; శవమును బయటకు తీసికొని వెళ్లిన తరువాత గ్రామ మంతటినీ పుణ్యాహ ఘోషణములతో జలము ప్రోక్షించి, శ్రీ స్వామికి పూజ జరిగింపవలెను. పూజ జరుగుచుండగా మరణము సంభవించిన ఆ పూజ త్వరగా ముగించి, శవము వెళ్ళిన తదుపరి వెనుకటి వలెనే పుణ్యాహ జలము చల్లి తిరిగి పూజ చేయవలెను.

గ్రామమునందు శూద్రాదుల మరణము సంభవించిన ఆ యింటి వరకు మాత్రము ఆశౌచము. అయినను ఆలయమునకు పదునొకండు (౧౧)★ ధనుస్సులలో శవము ఉండిన దానిని తీసికొని వెళ్ళిన తర్వాతనే పూజ జరిగింపవలెను. ఆలయ సమీప వీధియందు శవమున్నచో అర్చన చేయరాదు.

ఆలయవీధి కలసియున్న వీధియందు మరణము తటస్థించినను శవమున్నంత వరకు పూజ చేయరాదు. **నాలుగు వందలు బ్రాహ్మణులున్న గ్రామమునందు గానీ, బహుజనులు నివసించు పట్టణము లందు గానీ, గృహాశౌచమేగాని, గ్రామా శౌచము లేదు.**

★ ధనుస్సు = నాలుగు మూరల కొలత (౨ గజములు)

★ ౧౧ ధనుస్సులు = ౨౨ గజములు



# ❋ చక్రాబ్జమండలము ❋

## (దాని ఆరాధన క్రమము)

శ్రీ విష్ణుతిలకే శ్లో॥ ౧౬౫ నుండి ౨౧౯

శ్లో॥ ధ్యాయన్ నారాయణం దేవం । పుణ్యాహమపి, వాచయేత్ ।
అర్చయేత్ కర్ణికామధ్యే మంత్రాధ్వానం చతుర్ముఖ ।
బీజం పిండంచ సంజ్ఞాశ్చగాయత్రీం చ పదం తధా ।
మాలా మంత్రమ్ సమభ్యర్చ్య కేసరేషు తతః పరమ్ ।
పరమ్ వ్యూహమ్చ విభవమ్ విభవాంతరమప్యధ ।
అర్చామంతర్యామిణం తత్వాన్యపి సభాజయేత్ ।
దళేషుకాది వర్ణాంశ్చ పూజయేత్ నాభిమండలే ।
జాగ్రత్, స్వప్న, సుషుప్తిశ్చతుర్యన్తత్ర సభాజయేత్ ।
అశేషు జ్ఞాన మైశ్వర్యమ్ శక్తింబలమతః పరమ్ ।
వీర్యం తేజశ్చ సంపూజ్య నేమి భూమౌ చతుర్ముఖ ।
అర్చయేత్ భువనాధ్వానం బిందుషు ద్వాదశానపి ।
ద్వాదశాక్షర విద్యయా వర్ణాని ద్వాదశక్రమాత్ ।
అభ్యర్చ్య కర్ణికామధ్యే కర్ణికాయాం సమష్టిమత్
ద్వాదశాక్షర మంత్రంచా ఽ ప్యష్టాక్షర మతః పరమ్ ।
విష్ణు షడక్షరం చా ఽ పి గాయత్రీం వైష్ణవీమపి ।
వాసుదేవాది మంత్రాంశ్చ మీనా దీనాం తథైవచ
సౌదర్శనం హయగ్రీవం శ్రియో భూమ్యశ్చ పద్మజ ।
అనంత గరుడం చా ఽ పి, విష్వక్సేన మతః పరమ్ ।
తతః చండాది మంత్రాశ్చ పార్షదానాంత థైవచ ।
కేసరే ష్వపి తత్వాని సర్వాణ్యపి యధావిధి ।
దేవతాశ్చ, త్రయస్త్రింశ త్తత్రా వాహనమ్ చరేత్ ।

దళేష్వపి కకారాదిక్షాంత వర్ణా ఽ ర్చనంచరేత్ ।
నాభిదేశే కేశవాదీన్ మత్స్యాదీన్ వంకజాసన ।
విశ్వాదీన్ కుముదాద్యాంశ్చ లోకపాలాం స్తతః పరమ్ ।
కుమార్యాదీన్ కిన్నరాంశ్చ తథా కిం పురుషానపి ।
విమలాదీశ్చ వ్యాప్త్యాదీ శ్రీ వత్సాదీన్సమర్చయేత్ ।
అకారాది స్వరాన్ సర్వాన్ అరక్షేత్రే సమర్చయేత్ ।
అర్చయేత్ నేమీ భూభాగే భువనాని చతుర్దశ ।
విష్ణ్వాది సకలాన్ లోకాన్ నేమిభూమౌ సమర్చయేత్ ।
చక్రమండల దీక్షాయాం విధిరేష ఉదీరితః ।

## * రక్షాసూత్ర విషయమ్ *

శ్లో॥ కరస్తే దేశికా దీనామ్ దేవ దేవస్య వా ద్విజాః ।
నష్టేకౌతుక సూత్రేతు భిన్నేవ ముని పుంగవాః ।
సూత్రాన్తరమ్ పునర్ బధ్వాశాంతిహోమం సమాచరేత్ ।
రక్షా బంధం వినా కర్మప్రారంభే మునిసత్తమాః ।
సద్యోబధ్వా ప్రతి సరమ్ శాన్తిహోమం సమాచరేత ।
మహోత్సవాద్యుత్సవేషు ప్రతిష్ఠా ప్రోక్షణాదికే ।
కర్మణి స్నపనాదౌవా బద్ధ ప్రతి సరోగురుః ।
ఋత్వి జాశ్చ తథాభూతా మధ్యే ప్యాఽశౌచ సంభవే ।
భవన్తి నైవా శుచయ స్తత్త త్కర్మావ సానకమ్ ।
శావమ్ వా జాతకాశౌచమ్ కర్మానంతర మాచరేత్ ।
కర్మ మధ్యే స్నాన మాత్రమ్ కార్యశ్చావశ్య సంభవే ।
కర్మ మధ్యేపి యాశౌచం భవే దాత్మాన్వితే మృతే ।
పితా; మాతా; జేష్ఠపుత్రో; భార్యాచాఽత్మా న్వితాస్మృతాః ।
తదాగురో రభ్యనుజ్ఞాన్ లబ్ధాన్యో ద్దేశికోత్తమః ।



తద్దోషస్య ప్రశాంత్యర్థ ముత్తమోత్తమ మార్గతః ।
దేవం సంస్నాప్య శాంత్యర్థం హుత్వాఽహుతి సహస్రకమ్ ।
గో-భూ-తిలాదికమ్ దత్వా బ్రాహ్మణాన్ భోజయేత్ బహూన్ ।
తత స్సమాప్తయే త్కర్మ శేషం భక్తి సమన్వితః ।
గురౌవ్యాధితేవా మృతావాన్య త్సమాచరేత్ ।
కర్మ శేషం ద్విజః శ్రేష్ఠాః ప్రాయశ్చిత్త పురస్సరమ్ ।

తా॥ అర్చకునకు, యాజ్ఞికునకు; దేవునికి; యజమానికి కంకణ సూత్రము తెగినచో తిరిగి వేరొక(కొత్త) కంకణము కట్టి శాంతి హోమం జరిపించవలెను. మహోత్సవము మొదలగు ఉత్సవములు : ప్రతిష్ఠ : సంప్రోక్షణము మొదలగువాని ఋత్వికులకు : (యితరులకు) మధ్యలో అశుచి సంభవించిన వారికి యీ కంకణ ధారణవలన ఆశౌచము లేదు; జాతాశౌచ-మృతా శౌచములు ఆచేయు కర్మ పూర్తియైన తదుపరి ఆచరింపవలెను. కర్మమధ్యలో తల్లి-తండ్రి-పెద్ద కుమారుడు; భార్య మున్నగువారిలో ఎవరు చనిపోయిననూ కర్త తలనిండా స్నానంచేసి ఆ దోష శాంతి కోసం శాంతి హోమం చేయవలెను. మూలమంత్రముతో వేయి ఆహుతులు విడువవలెను. గో-భూ-తిల-భోజన దానములను చేయవలెను. దైవకార్యము ముగిసిన పిదప జాతా శౌచ-మృతాశౌచములను ఆనాటి నుండి యదావిధిగా నెరవేర్చవలెను.

## * సర్వవిధశుద్ధులు *

| | |
|---|---|
| అర్చకుడు | : స్నాన-ఆచమన-శౌచములు; |
| మనస్సు | : భగవత్ ప్రసాదము-జ్ఞానము-సంతోషము; |
| వచస్సు (మాట) | : సత్యము-భూతహితము-మేలుతలచుట; |
| స్థానము | : చిమ్ముట-అలుకుట-చల్లుట-అక్షతలు ఉంచుట; |
| ద్రవ్యము | : చింతపండు పులుసులో బంగారు - రాగి వస్తువులు; బూడిదలోనూనె మొదలగువాని జిడ్డు; బొగ్గుపొడిలో వెండి; ఊక (పొట్టు) శంఖము. |

| | |
|---|---|
| ఫలపాత్ర | : మంచినీటి తోడను |
| దీపపాత్ర | : మరగ కాగిన నీటితోడను. |
| మట్టిపాత్ర | : నిప్పుతోడను |
| వస్త్రములు | : సుగంధ ధూపము తోడను |
| రత్నములు | : దర్భనీటి తోడను |
| ద్విజులు | : (బ్రహ్మ; క్షత్రియ; వైశ్యులు) పూల నీటి తోడను |
| పూవులు | : నీటి తోడను |
| దీపము | : వెలిగించుట తోడను |
| స్తంభము | : నీటితో కడుగుట వల్లను |
| హవిస్సు | : పారవేయుట చేతను; (ఇది చెడిన శుద్ధిలేదు) |
| కంచు | : బూడిద-ఊక వలననూ |
| మంత్రము | : ఓం మొదట - నమః చివర పలుకుటవల్లనూ |
| విగ్రహము | : దర్భనీళ్ళు;గంధము తోడను |
| శఠారి | : అర్చకుని చేతితాకుడు వలననూ |
| నీరు | : క్రొత్తపాత్రలో క్రొత్త గుడ్డతో వడబోయుట వలన ఆయా ద్రవ్యములు - ఆయా వస్తువులతో శుద్ధి జరుగును. (కపింజల సంహితా). |

## * విద్ధా; శుద్ధా తిథులు *

(1) శుద్ధతిథి = మొదట గానీ చివర గానీ ఏ తిధియునూకలియక ఒకే తిథి పూర్ణముగా ఉండు దానిని 'శుద్ధా' అందురు.

(2) విద్ధతిథి = ఒక తిథికి మొదట గానీ, చివరగానీ మఱి ఒకతిథి కలిసినచో- 'విద్ధా'- లేక 'వేధా' అందురు!

విష్ణుభక్తులైన వారు పూర్వవేధ కలిగిన తిథులను విడచి, పరవేధా తిథులనే పరిగ్రహింప వలెను.



**విద్ధను గూర్చి శాస్త్ర ప్రమాణము :**

శ్రీ పాంచరాత్ర దివ్యాగమాంతర్గతమగు 'శ్రీ విష్ణుతిలక' సంహిత యందు 8వ అధ్యాయమున 84; 85 శ్లోకములు -

శ్లో॥ కలయాఽపి విద్ధయాచే త్తిధి ర్వా యది తారకా।
వర్జయి త్వా ఽ థ తాం విద్ధామ్ పరేద్యుః కర్మమాచరేత్ ॥౮౪॥
కలా మాత్రా ఽ వ శేషా చే, త్తిథి ర్వాయది తారకా।
తత్రోఽ త్సవమ్ ప్రకుర్వీత సాహి సర్వ గుణోత్తరా ॥౮౫॥

తా॥ పూర్వ తిథి, నక్షత్రముల విద్ధ కలా మాత్రము తగిలిననూ, ఆదినమును విడచి మరునాడు భగవదత్సవమును, తదంగ భూతమగు కార్యములను నెరవేర్పవలెను !

మఱునాడు ఉండవలసిన తిథి నక్షత్రములు ఒక కలా మాత్ర సమయమే ఉండిననూ ఆనాడే భగవదుత్సమును ఆచరింపవలెను. అట్టి పూర్వ విద్ధారహితమగు దినము నందు భగవదుర్చన, కైంకర్యములు అనంత, దివ్య, పుణ్య ఫలములను ప్రసాదించును !

**పంచకాలములు :** ప్రాతః-సంగవ-మధ్యాహ్న-అవరాహ్న-సాయం కాలములు.

**కాలనిర్ణయములు :**

శ్లో॥ పంచపంచ ఉషః కాలః, సప్తపంచ అరుణోదయః।
అష్ట పంచ భవేత్ ప్రాతః, తదూర్ధ్వమ్ ఉదయం భవేత్॥

తా॥దినమునకు 60 గడియలు; 55 గడియల వరకు ఉషః కాలము; అప్పటినుండి 57 గడియల, వరకు అరుణోదయ కాలము; అసమయమునుండి 58 గడియల వరకు ప్రాతఃకాలము దాని తరువాత ఉదయ కాలము అని శాస్త్ర నిర్ణయము.

**మనపూర్వుల కాల గణన విజ్ఞానము :**

**పద్ధతి (1) :**

| | | |
|---|---|---|
| 2 పరమాణువులు | = | 1 అణువు |
| 3 అణువులు | = | 1 త్రసరేణువు |
| 3 త్రసరేణువులు | = | 1 తృటి |
| 100 తృటులు | = | వేధ |
| 3 వేధలు | = | 1 లవము |

3 లవములు = 1 నిమేషము (రెప్పపాటు)
15 నిమేషములు = 1 క్షతము
30 క్షతములు = 1 కాలము
30 కాలములు = 1 ముహూర్తము
30 ముహూర్తములు = 1 దినము (శ్రీమద్ భాగవతే - మైత్రేయః)

**(2) మఱియొక పద్ధతి :**

బాగుగ వాడి యైన మొన కలిగిన సూదితో పద్మపురెమ్మను గుచ్చుటకు

పట్టు కాలము = 1 త్రుటి
100 త్రుటులు = 1 లవము
30 లవములు = 1నిమేషము (ఇప్పటి నిమిషము వేరు)
27 నిమేషములు = ఒకగురు (దీర్ఘా) అక్షరము ఉచ్చరించు కాలము

(రెండులఘువులు 1 గురువు ఉదా: ఆ-ఈ-ఊ-ఓ-ఔ-ఔ, లు)

10 గురు అక్షరోచ్చారణ - కాలములు = 1 ప్రాణము
6 ప్రాణములు = 1 వినాడి
60 వినాడులు = 1 నాడి (1 గడియ) (అనగా ఇప్పటి లెక్కకు 24 నిమిషములు)
2నాడులు (గడియలు) = 1 ముహూర్తము (48ని.లు)
8 ముహూర్తములు = 1 పగలు లేక 1 రేయి
16 ముహూర్తములు = 1 దినము
7 దినములు = 1 వారము
15 దినములు = 1 పక్షము
30 దినములు = 1 నెల (శుక్ల - కృష్ణ పక్షములు)
2 నెలలు = 1 ఋతువు
6 నెలలు, 3 ఋతువులు = 1 అయనము
2 అయనములు = (ఉత్తర; దక్షిణ అయనములు) 1 వత్సరము
6 ఋతువులు = (వసంత-గ్రీష్మ-వర్ష-శరత్-హేమంత-శిశిరములు)
12 నెలలు = (చైత్రము మున్నగునవి) 1 వత్సరము



కాల గణనము అల్ప జీవి యగు మానవునకు మాత్రమే ! కాలస్వరూపుడునూ-చరాచర సృష్టికారకుడునూ అగుపరమాత్మకు కాలనియమము లేదు అని మనము తెలిసికొనవలెను.

**(3) వేరొకపద్ధతి :**

18 రెప్ప పాటులు = 1 కాష్ఠ
30 కాష్ఠలు = 1 కల(కళ)
30 కలలు = 1 క్షణము (4 నిమిషములు)
12 క్షణములు = 1 ముహూర్తము
30 ముహూర్తములు = 1 దినము
30 మానవ దినములు = 1 పితృదినము (1 నెల)
12 నెలలు = 1 వత్సరము
1 మానవ సంవత్సరము = 1 వసువులకు దినము లేక (1 దేవతల దినము)
1000 దేవ వత్సరములు = 1 దివ్య యుగము
1000 దివ్య యుగములు = 1 బ్రహ్మదినము

ఒక బ్రహ్మ దినమునందు 14 మనువులు పరిపాలన పూర్తియగును.

**ఆధారము : శ్రీ నృసింహపురాణము**

**కొన్ని తిథుల పరిభాష**

సినీవాలీ = చతుర్దశిలో కూడిన అమావాస్య
కుహూ = పాడ్యమిలో కూడిన అమావాస్య
దర్శ = అమావాస్య
రాకా = నిండు పూర్ణమా;
అనుమతి = ఒకకళ తక్కువ పూర్ణమా
మా = చంద్రుడు, కాంతి, లక్ష్మి, తల్లి మున్నగు అర్థములు కలవు
పూర్ణమా = నిండు చంద్రుడు ; నిండు కాంతి గలదినము
అమా = చంద్రుడు (కాంతి) లేని దినము.
విషువత్ = రేయీ-పవలూ సమానముగాకల దినము.

**ద్రైర్ఘ్యమానము (కపింజలే)**

| | | |
|---|---|---|
| 8 పరమాణువులు | = | 1 రేణువు |
| 8 రేణువులు | = | 1 వాలుక |
| 8 వాలుకలు | = | 1 రక్ష |
| 8 రక్షలు | = | 1 యూక |
| 8 యూకలు | = | 1 తిల; లేక యవ |
| 8 యవలు | = | 1 మానాంగుళము |
| 24 మానాంగుళములు | = | నిష్కు |
| 25 మానాంగుళములు | = | ప్రాజావత్యము |
| 12 అంగుళములు | = | 1 తాలము |
| 2 తాలములు | = | 1 హస్తము |
| 8 హస్తములు | = | 1 ధనువు |
| 2 ధనువులు | = | 1 దండము |
| 500 ధనువులు | = | 1 క్రోశము |
| 4 క్రోశములు | = | 1 గోపానము |

[ప్రాదేశ = జిట్ట; వితస్తి =12 అం ; హస్త = 2 అఢుగులు (తాలములు)]
( శ్రీపాద్మే క్రియాపాదే ౧౨ అధ్యాయే ౪౮ ; ౪౯ శ్లోకాని)

**నేయి; ధాన్యముల కొలత**

| | | |
|---|---|---|
| 4 వ్రీహులు | = | 1 కుంజము |
| 8 కుంజములు | = | 1 మంజిష్టము |
| 106 మంజిష్టములు | = | 1 నిష్కము |
| 8 నిష్కములు | = | 1 ఫలము |
| 5 ఫలములు | = | 1 కుడుభము |
| 4 కుడుభములు | = | 1 ప్రస్త(ము) |
| 4 ప్రస్తలు | = | 1 ఆఢకము |
| 2 ఆఢకములు | = | 1 శివము |
| 2 శివములు | = | 1 ద్రోణము |
| 2 ద్రోణములు | = | 1 ఖారీ |
| 3 ఖారీలు | = | 1 భారము |



ప్ర : మన నెలకు ఆపేర్లు ఎట్లు వచ్చినవి ?

స : పూర్ణమనాడు ఏ నక్షత్రము ఉండునో ఆ నెలకు ఆ పేరు వచ్చును.

| పూర్ణమనాడు | | చాంద్రమాసములు | వేదోక్తమానములు | ఋతువులు |
|---|---|---|---|---|
| చిత్ర ఉండిన | = | చైత్రము | మధు | వసంత |
| విశాఖ ఉండిన | = | వైశాఖము | మాధవః | |
| జ్యేష్ఠ ఉండిన | = | జ్యేష్ఠము | శుక్రః | గ్రీష్మ |
| ఉత్తరాషాఢ ఉండిన | = | ఆషాఢము | శుచిః | |
| శ్రవణము ఉండిన | = | శ్రావణము | నభో | వర్ష |
| ఉత్తర భద్ర ఉండిన | = | భాద్రపదము | నభస్య | |
| అశ్విని ఉండిన | = | ఆశ్వినము | ఇషః | శరత్ |
| కృత్తిక ఉండిన | = | కార్తికము | ఊర్జః | |
| మృగశిర ఉండిన | = | మార్గశిరము | సహో | హేమంత |
| పుష్యమి ఉండిన | = | పౌష్యము | సహస్య | |
| మఘ ఉండిన | = | మాఘము | తపో | శిశిర |
| ఉత్తర ఫల్గుణి ఉండిన | = | ఫాల్గుణము | తపస్య | |

(అను పేరులు కలుగును)

## ❋ అధికమాస – క్షయ మాసములు ❋

శ్లో॥ అసంక్రాంతి మాసోఽధిమాసస్ఫుటమ్ స్యా
ద్విసంక్రాంతి మాసః క్షయాఖ్యః కదాచిత్ ।
క్షయః కాది త్రయే నాఽన్య తస్యా
త్తదావర్ష మధ్యేఽధిమాసద్వయంచ ।

తా॥ చాంద్రమాసమునందు సూర్యసంక్రమణము జరుగని ఎడల అది అధిక (మల) మాసము అగును.

ఒకే చాంద్రమాసమున సూర్య సంక్రమణములు రెండు సంభవించిన అది క్షయ మాసము అగును. అధిక - క్షయమాసముల యందునూ త్రయోదశదిన పక్షము నందునూ భగవదుత్సవములూ - శుభకార్యములూ నిషిద్ధము.

# ❋ ఆలయము : శంకుస్థాపన ❋

(నారద ప్రోక్తమ్)

శ్లో॥ వాపీ - కూప - తటాక - సేతు - పరిఘాసు భిత్తేరథో ।
భిత్తీనా మపి బాహ్యదేశ నికటే, సర్వత్ర దేవాలయే ।
భిత్తీనా మపి చాఽన్తరేచ నిలయే నృణామ్; పశూనామ్ సదా ।
తావత్కాల గృహస్థితిర్ గృహపతే ద్యావచ్ఛ శంకు స్థితిః ।

తా॥ దిగుడుబావి - బావి - చెఱువు - వంతెన (కోట) కందకములకు గోడ క్రిందనూ; అన్నిదేవాలయములకునూ ప్రాకారమునకు వెలుపలవైపు గోడకు ఆనుకొని ఉండిన చోటనూ ; మానవులు నివసించు ఇళ్లకునూ ; పశువుల కొట్ట(గోష్ఠ)ములకునూ ఇంటి గర్భమునందు నాలుగు గోడల నడుమనూ ; శంకుస్థాపనము చేయవలెను. శంకువు ఎంతకాలము స్థిరముగా ఉండునో - ఆనిర్మాణముచేసిన యజమానికి ఆయురారోగ్య భోగ - భాగ్యములు అంతకాలము స్థిరముగా ఉండును :

(పాద్మే -క్రియాపాదే - )

శ్లో॥ హస్తమానాఽఽయతమ్ శంకుమ్ ద్వాద శాఽంగుల మేవవా ।
క్షీర వృక్షజ మంగుష్ఠ పరిమాణ మృజుమ్ శుభమ్ । ౨ ।
ప్రాసాద స్థానమధ్యేతు స్థాపయే న్మూల విద్యయా ।
శంకోర్ద్విగుణ మానేన పరితో మండలమ్ లిఖేత్ । ౩ ।
అష్టదిక్షుః యథాన్యాయమ్ శంకుస్థాపన మాచరేత్ । ౪ ।

శంకులక్షణమ్ : ( శ్రీ పురుషోత్తమే ౨ అ)

శ్లో॥ తచ్ఛంకుమ్ త్రివిధమ్ కృత్వా చాఽధస్తా చ్చతురంతరే ।
తన్మధ్యే చాఽష్ట ఫలకమ్ తదగ్రమ్ కమలాకృతిః ।
ఏవమ్ లక్షణ సంయుక్తమ్ శంకుమ్ సంపూజయేత్తతః ।

తా॥(పాద్మ - క్రియాపాదంలో) 2 అడుగులు గానీ, లేక అడుగుగానీ పొడవు గల రావి - జువ్వి - మఱ్ఱి - మేడి కొమ్మలలోదేని నైననూ ఒక అంగుళము లావుగల వంకర లేని కొమ్మను శంకువుగా ఒనర్చి గర్భమందిర మధ్య బాగమున ఓమ్ నమోనారాయణాయ అను మూల మంత్రములో స్థాపింపవలెను.' శంకుస్థాపనచేయుచోట శంకువు కొంతకు



రెట్టింపు మండలమును రచియింప వలెను..... ఎనిమిది దిక్కుల యందును శంకువులను స్థాపింప వలెను.

శంకు లక్షణము : (పురుషోత్తమే ౨ అధ్యాయంలో)

తా॥ ఆశంకువును మూడు విభాగములుగా గుర్తుపెట్టుకొని క్రింద భాగమును చతురముగానూ; మధ్యభాగమును ఎనిమిది పలకలుగానూ; దాని పైభాగము కమలము ఆకారముతోనూ నిర్మింప వలెను. ఈ లక్షణము గల (రాతి) శంకువును పూజించి ప్రతిష్ఠింపవలెను !

పంచసంస్కారములు

శ్లో॥ తాపః - పుండ్రః - తథానామ - మంత్రో - యాగశ్చ పంచమః
అమీః పంచసంస్కారైః.

## అష్టబంధన ద్రవ్యములు

శ్లో॥లాక్షా. సజ్జరసమ్ చైవ - గుగ్గులంచ - గుళం తథా ।
సర్వేషా మర్ధత సైలమ్ పాచయే న్మృదు వహ్నినా । 3 ౧
ఘన చూర్ణమ్ - మధూచ్ఛిష్టమ్ - కురువిందంచ గైరికమ్ ।
ఏకైకం చ సమాంశేన గ్రాహ్యమ్ సజ్జరసమ్ తథా -- 3 ౨
తైలేన పాచితమ్ సార్ధ మష్ట బంధన మిష్యతే । 3 3

తా॥ లక్క - సజ్జరసము; గుగ్గిలము; బెల్లము; ఘనచూర్ణము, తేనెమైనము; కురువిందము; గైరికము అనుధాతువులు సమానముగ తీసికొని వీటికి సగము తూకము నూవులనూనె కలిపి నీలిమంటతో కాచిన, చిక్కబడి తగిన జిగురు స్థితి కలిగినపుడు యోగపీఠము నందుంచి ధ్రువబింబము క్రిందనున్న శంకువును సమముగా దింపి చుట్టూసంధులన్నియు పై అష్టబంధన ద్రవ్యములతో పూర్తి గట్టిగా బంధింపవలెను.

## ❋ పంచోపనిషత్ మంత్రాః ❋

౧.ఓమ్ షాంనమః పరాయపరమేష్ఠ్యాత్మనే, పురుషాయనమః
౨.ఓమ్ యాం నమః పరాయ పురుషాత్మనే, సంకర్షణాయనమః
3.ఓమ్ రాం నమః పరాయ విశ్వాత్మనే, ప్రద్యుమ్నాయనమః
౪.ఓమ్ వాంనమః పరాయనివృత్త్యాత్మనే, అనిరుద్ధాయనమః
౫.ఓమ్ లాంనమః పరాయ సర్వాత్మనే, నారాయణాయనమః

## ❋ తులసీ మహాత్మ్యము ❋

**విష్ణుధర్మోత్తరము నందిట్లున్నది - శ్రీ భగవాన్ :**

శ్లో॥ తులసీకాష్ట మాలాంచ కంఠస్థామ్ వహతేతు యః ।
అప్యశౌచో ఽ ప్యనాచారో మామేవైతి నసంశయః ॥

తా॥ తులసికట్టెతో చేసినమాలను ఎవడు మెడయందు వేసికొనునో-వాడు ఆచారము లేనివాడయినను; ఆశౌచము కలవాడైనను (జాతా శౌచ - మృతా శౌచములు కలిగినను) నన్ను జేరుకొనుచున్నాడు. సందేహము ఏమాత్రమును లేదు అని శ్రీమన్నారాయణుడు సెలవిచ్చెను.

శ్లో॥ యజ్ఞోపవీత వద్ధార్యా కంఠే తులసిమాలికా ।
క్షణ మాత్రపరిత్యాగా ద్విష్ణుద్రోహీ భవేన్నరః ॥
అశౌచేచాప్యనాచారే కాలే ఽ కాలేచ సర్వదా ।
తులసీ మాలికామ్ ధత్తె సయాతి పరమమ్ పదమ్ ॥ (సాధనకృతాంజలి)

తా॥ యజ్ఞోపీతమువలె విడువక తులసిమాలను కంఠమున ధరించవలెను. క్షణ మాత్రము తీసినను వాడు విష్ణుద్రోహి యగును. అశుచియైనను, అనాచారియైనను, ఇదితగు సమయము-ఇదికాదు అనక సర్వకాల-సర్వావస్థల యందును ధరించువాడు పరమ పదమును పొందును.

★ తులసి జన్మ దినము కార్తిక పూర్ణిమ. ఆనాడు తులసితో విష్ణునర్చించిన వైకుంఠవాసము లభించును. మరల జన్మము లేదు.

శ్లో॥ పుష్కరాద్యాది తీర్థాని గంగాద్యాః సరిన్తధా ।
వాసుదేవాదయో దేవాః వసంతి తులసీ దళే ॥ (గర్గ సంహిత)

తా॥ పుష్కరము మున్నగు తీర్థములు; గంగ మొదలగు నదులు వాసుదేవుడు మొదలుగా గల దేవతలు తులసీ దళమునందు ఎల్లపుడు నివసించి యుందురు.

శ్లో॥ కర్ణే పుష్పమ్; గళేగంధమ్; । కేశానామ్ తులసీ దళమ్ ।
యావ ద్ధారయతే విప్రో । తావత్ శూద్రోనసంశయం ॥

తా॥ ఆలయమున యిచ్చిన పూలు చెవి యందును; గంధము గొంతు క్రిందను; వెంద్రుకలయందు తులసిని ధరించిన బ్రాహ్మణుడయినను-శూద్రుడగును, ఇది నిశ్చయము : (కావున అట్లు ధరించరాదు) తులసి ఆకులను తిని కాడను



చెవియందును-పుష్పమును శిరస్సుయందును ధరింపవలెను. గంధము అరచేతులకు రాచుకొని వాసన చూచుకొనవలెను.

**ప్ర : ముఖవాస మననేమి ?**

స : ముఖవాసమనగా-పచ్చకర్పూరము; కుంకుమపూవు; మొదలగు పదార్థములు కలిసినది. వీనిని తమలపు ఆకులు వక్కలతో దక్షిణతో కలిపి తాంబూలము సమర్పింప వలెను.

**ప్ర. తాంబూలము నందు ఎన్ని వక్కలు ఉండచవలెను ?**

సః శ్లో ॥ ఏక పూగమ్ మహాపాపమ్ ద్విపూగమ్ నిష్ఫలం భవేత్ ।
త్రిపూగమ్ సుఖామాప్నోతి ..... ॥

ఒక వక్క పెట్టిన మహాపాపము రెండు వక్కలు పెట్టిన నిష్ఫలము, మూడు వక్కలు పెట్టిన సుఖము కలుగును. (దక్షిణకూడా వుంచవలెను)

**ప్ర : అర్ఘ తాంబువులు అననేమి?**

సః ఏలకులు - పచ్చకర్పూరము గూడి సమ శీతోష్ణమైన నీరు అర్ఘణ జలము : దీనిని భగవానునికి నివేదన చేయుటకు ముందు స్వామి కుడియర చేతికి (కడిగికొనుటకు యిచ్చినట్లు) చూపించి పతత్ గ్రహపాత్రయందుంచ వలెను

**మాత్రా దానము :**

శ్లో॥ తాంబూలం -తండులం -ముద్గ మాజ్యం - ఫలాని చ ।
గోగ్రాసం - గాశ్చ - వసనం -మాత్రా ద్రవ్యమితీరితమ్ ।

తా ॥ తాంబూలము బియ్యము - పెసలు -నేయి-బంగారము - పండ్లు; ఆవుకు మేత ఆవు-వస్త్రములు పూజాసమయమున భగవానునకు అర్పింపవలెను. దీనికి మాత్రా దానమని పేరు.

**తర్పణము :**

అపక్వములు - అతిపక్వములు - సుపక్వములు - జలపక్వములు - పానీయములు చెఱకురసము- కొబ్బరినీళ్ళు భగవానునకు నివేదించదగిన తర్పణ వస్తువులు.

**ప్రావణము :**

బాగుగ పండిన పండ్లరసములు - భక్ష్య - భోజ్యములు -తేనె మున్నగు తీయని వస్తు సముదాయము భగవానునకు ప్రావణముగ నివేదింపదగిన వస్తువులు

**ముఖవానము :**

సుగంధవస్తువులతో గూడిన తాంబూలము.

## ❋ దేవుడు సాకారుడా ? ❋

ప్ర : దేవుడు సాకారుడా ? నిరాకారుడా ?

స : ఎవరినీడ వారివలె నుండును గదా ?

నిరాకారుడయిన భగవానుడు సాకారమగు ప్రకృతిని-జీవులను సృజించునా? సాకారమగు జీవులనూ, ప్రకృతినీ సృజంచిన పరమాత్మ సాకారుడే యగును. కాలు-చేతులు; కండ్లు మున్నగు అవయవములేని కుమ్మరి పాత్రల నెట్లు చేయగలడు ! నిశ్చయముగ భగవానుడు సాకారుడే ! బంగారు మంచి చెడ్డలు షరాబుకు తెలిసినట్లు; భగవద్దర్శనము పరమ భక్తిపరునకే కలుగును. 5వ తరగతి తప్పిన వానికి M.A. డిగ్రీ లభించుటెట్లు ? భగవద్రూపము గాంచుటకు సాధన-భక్తి ఉత్తమ సాంగత్యము. పురాకృత జన్మ విశేషము-సద్గురు బోధ అవసరము !

## ❋ మంత్రము ❋

ప్ర: మంత్రము అనగానేమి?

స: మననాత్ ప్రాణిన స్త్రాతి యతో మంత్రముదీర్యతే (పాద్మే)

తా॥ మనసునతలచినంత మాత్రమున ఎయ్యది (సమస్త ప్రాణులను) కాపాడునో దానిని మంత్రమని తెల్పుదురు; అనిపాద్మ సంహితయందు కలదు.

## ❋ ఏకాయన వేద మంత్రములు ❋

1. ప్రాకారమంత్రమ్ : ★
   "ఓం రాం నమః పరాయకాలాత్మనేనమః
2. అంకుశ మంత్రమ్ :
   "ఓం సర్వాకర్షకర మహామాయాయ అంకుశాయ ఫట్
3. ఆవాహన మంత్రమ్ : ★
   "ఓం ఓం ఓం పరమధామావస్థిత కామ్య యోఽద్యతావతార ఇమామిమత సిద్దిద మంత్రశరీరోమ్ నమః,



4. ఖడ్గ మంత్రమ్ : (సాత్వత సంహితా)
   "ఓం మహామాయాయ బంధధ్వంసినే ఖడ్గాయఫట్
5. ఖేట మంత్రమ్ (సాత్వత)
   "ఓం సర్వాస్త్ర గ్రసనపరాయ ఖేటాయఫట్
6. కిరీట మంత్రమ్ :
   "ఓం సహస్రదీధితి చరిత విగ్రహాయ కిరీటాయనమః
7. కృష్ణ మంత్రమ్ :
   "ఓం క్లీంకృష్ణాయ గోవిందాయ గోపీజన వల్లభాయ స్వాహా"
8. కౌస్తుభమంత్రమ్ : (పాద్మం)
   "ఓం నమః కౌస్తుభాయ రత్నాధి పతయే, అమృతోద్భవాయ ఆకల్పాధి పతయే సిద్ధిం ప్రయచ్ఛ స్వాహా"
9. గదా మంత్రమ్ : (పాద్మం)
   "ఓం నమో భగవత్యయ్ గదాయై భవరూపిణ్యై కౌమోదక్యై హుంఫట్
10. ఘంటా మంత్రమ్ : ★ (పాద్మం)
    "ఓం టూం హూం ఘంటాయై నమః"
11. చక్రమంత్రమ్ : (పాద్మం)
    "ఓం నమో భగవతే సుదర్శనాయ"
12. దండ మంత్రమ్ :
    "ఓం సంతాపకరాయ దర్ప విధ్వంసినే దండాయఫట్
13. ధూప మంత్రమ్ : ★ (పాద్మం)
    "ఓం ధ్యూం ధూమోద్గిరాయ నమః
14. నామత్రయమన్త్ర :
    "ఓం అచ్యుతాయనమః; అనన్తాయనమః గోవిన్దాయ నమః"

(సాత్వత సంహితా)
15. పరశు మంత్రమ్ :
"ఓం అజ్ఞాన ఖండన పరాయ పరశవే ఫట్"
(జయాఖ్య సంహితా)
16. పద్మ మంత్రమ్ :
"ఓం బ్సుం నమః శ్రీనివాస పద్మాయ స్వాహా"
(సాత్వత సంహితా)
17. పాశ మంత్రమ్ :
"ఓం త్రైలోక్య మోహన మూర్తయే పాశాయ ఫట్"
18. ప్రసాద మంత్రమ్ :
"ఓం ఈం హీం హీం హంసపర పరమేశ ప్రసీద ఓం నమః"
19. ప్రద్యుమ్న మంత్రమ్ :
"ఓం నమో భగవతే ప్రద్యుమ్నాయ స్వాహా"
20. ముద్గర మంత్రమ్ :
"ఓం అఖండిత పరాక్రమాయ ముద్గరాయ ఫట్"
(సాత్వత సంహితా)
21. ముసల మంత్రమ్ :
"ఓం ప్రగ్భవనాధిపతయే స్తంభభూతాయ ముసలాయ హుంఫట్"
(పాద్మ)
22. లక్ష్మీ నారాయణ మంత్రమ్ :
"ఓం నమో భగవతే లక్ష్మీనారాయణాయ స్వాహా"
23. వజ్రమంత్రమ్ :
"ఓం దర్పప్రశమనకర్త్రే వజ్రాయ ఫట్"
(సాత్వత)
24. వనమాలా మంత్రమ్ :
"ఓం ల్బ్సీమ్ నమః స్థల జలో ద్భూత భూషితే వనమాలే స్వాహా । ఓం సౌభాగ్యజనని సర్వప్రదే వనమాలాయై నమః
(జయాఖ్యే)
25. విసర్జన మంత్రం : ★
"భగవన్ మంత్రమూర్తే స్వపద మాసాద యాసాదయ"



(శేష సంహితా)
26. శంఖ మంత్రమ్ :
"ఓం శబ్దమూర్తయే శంఖాయఫట్"
27. శార్ఙ మంత్రమ్
"ఓం కల్పాంతానిల ఘోషాయ విద్యుల్లసిత ప్రభాయ శార్ఙాయ ఫట్"
(సాత్వత)
28. శ్రీవత్స మంత్రమ్
"ఓం సర్వలక్షణ సంప్రదాయ శ్రీ వత్సాయనమః
29. శ్రీ కరాఒష్టాక్షరీ మంత్రమ్ :
"ఓం ఉత్తిష్ఠ శ్రీకరస్వాహా"
(శేష సంహితా)
30. ఆసన మంత్రమ్ : ★
"ఓం అఖిల జగదాధారాయ కూర్మరూపిణే అనంత పద్మనాభాయ హుంఫట్"
(నివేదన మంత్రము)
31. భోగదాన మంత్రమ్ : ★
"ఓం హం హం హం ఇద మిదం గృహాణ స్వాహా"
32. అస్త్ర మన్త్రమ్ : ★ ఓం సహస్రారహుం ఫట్ స్వాహా
౧ (తలుపువేయు మంత్రము.)
౨ (తలుపువేయు మంత్రము)
కవచ మంత్రమ్ :
"ఓమ్ కవచాయహుం అష్ట దిగ్బంధః"
(తలుపుతీయు మంత్రము)
33. వాయు మంత్రమ్ : ★
"ఓం యం వాయవేనమః"
34. మూల మంత్రమ్ అష్టాక్షరి :
"ఓమ్ నమో నారాయణాయ"
35. ద్వాదశాక్షరి (మూల మంత్రమ్)
"ఓం నమో భగవతే వాసుదేవాయ".
36. గాయత్రి మంత్రమ్
"ఓం భూర్భువ స్సువః తత్సవితు ర్వరేణియమ్ భర్గో దేవస్య ధీమహి ధియోయోనః ప్రచోదయాత్"

37. విష్ణు గాయత్రి : (మూల మంత్రమ్)

"నారాయణాయ విద్మహే
వాసుదేవాయ ధీమహి
తం నో విష్ణుః ప్రచోదయాత్
ఓమ్ విశ్వరూపాయవిద్మహే। విశ్వనీతాయ ధీమహి।
తంనో విష్ణుఃప్రచోదయాత్। (జయాఖ్యే)

38. కూర్మ గాయత్రి :

"లోకాధ్యక్షాయ విద్మహే
ధనాధ్యక్షాయ ధీమహి
తంనః కూర్మః ప్రచోదయాత్

39. గరుడ గాయత్రి :

"పక్షిరాజాయ విద్మహే
స్వర్ణ పక్షాయ ధీమహి
తన్నో గరుడః ప్రచోదయాత్

40. బ్రహ్మగాయత్రి :

"ఓం వేదాత్మనాయ విద్మహే
హిరణ్య గర్భాయ ధీమహి
తమ్నః బ్రహ్మః ప్రచోదయాత్

41. ఇంద్రగాయత్రి

"ఓమ్ దేవరాజాయ విద్మహే
వజ్ర హస్తాయ ధీమహి
తమ్ నః ఇంద్రః ప్రచోదయాత్

42. అగ్ని గాయత్రి :

"ఓం వైశ్వానరాయ విద్మహే
జ్వాలా మాలాయ ధీమహి
తమ్నో అగ్నిః ప్రచోదయాత్



43. యమగాయత్రి :

"ఓం వైవస్వతాయ విద్మహే
దండహస్తాయ ధీమహి
తం నోయమః ప్రచోదయాత్

44. నిర్‌ఋతి గాయత్రి :

"ఓం నిశాచరాయ విద్మహే
ఖడ్గహస్తాయ ధీమహి
తన్నోనిర్‌ఋతిః ప్రచోదయాత్

45. వరుణ గాయత్రి :

"ఓం శుద్ధిచరాయ విద్మహే
పాశహస్తాయ ధీమహి
తన్నో వరుణః ప్రచోదయాత్

46. వాయుగాయత్రి :

"ఓం జగత్ప్రాణాయ విద్మహే
గంధ వాహాయ ధీమహి
తన్నోవాయుః ప్రచోదయాత్

47. కుబేర గాయత్రి

"ఓం అత్రిపురుషాయ విద్మహే
గదా హస్తాయ ధీమహి
తన్నో కుబేరః ప్రచోదయాత్

48. రుద్రగాయత్రి :

౧. "ఓం భూతేశాయ, విద్మహే,
శూలహస్తాయధీమహి,
తన్నోరుద్రః ప్రచోదయాత్

౨. ఓం అగ్ని నేత్రాయ విద్మహే
నీలకంఠాయ ధీమహి
తన్నోరుద్రః ప్రచోదయాత్

49. శేషగాయత్రి

"ఓం ఉర్వీధరాయ విద్మహే
మహానాగాయ ధీమహి
తన్నోశేషః ప్రచోదయాత్

50. హనుమ గాయత్రి :

"ఓం శబ్దరాజాయ విద్మహే
వాయుపుత్రాయ ధీమహి
తన్నోహనుమత్ప్రచోదయాత్

51. విష్వక్సేన గాయత్రి :

"ఓం విష్వక్సేనాయ విద్మహే
వేత్రహస్తాయ ధీయహి;
తన్నో సేనేశః ప్రచోదయాత్

52. ధ్వజ గాయత్రి

"ఓం ధీర్ఘ కాయాయ విద్మహే
ఫలక త్రయాయ ధీమహి
తన్నో ధ్వజః ప్రచోదయాత్

53. రామ గాయత్రి :

"ఓం దాశరధాయ విద్మహే
సీతానాధాయ ధీమహి
తన్నోరామః ప్రచోదయాత్

54. లక్ష్మి గాయత్రి

"ఓం మహా దేవ్యైచ విద్మహే
విష్ణు వత్న్యైచ ధీమహి
తన్నోలక్ష్మీః ప్రచోదయాత్



55. ధరా గాయత్రి :

"ఓం ధనుర్ధరాయ విద్మహే
సర్వ సిద్ధ్యైచ ధీమహి
తంనో ధరాః ప్రచోదయాత్

## ❋ ప్రవరలు ❋

శ్రీరామ : వాసిష్ఠ - మైత్రావరుణ - కణ్వ త్రయార్షేయ ప్రవరాన్విత వాశిష్ఠ
సగోత్రోద్భవస్య -
దిలీప మహారాజ వర్మణోనప్త్రే
అజమహారాజ వర్మణః పౌత్రాయ
దశరధ మహారాజ వర్మణః పుత్రాయ
శ్రీరామచంద్ర నామధేయోవరాయ ।

సీతాదేవి - ఆయాస్య - గౌతమ త్రయార్షేయ ప్రవరాన్విత గౌతమ సగోత్రం
హ్రస్వరోమ మహారాజ వర్మణోనప్త్రీం
స్వర్ణరోమ మహారాజ వర్మణః పౌత్రీం
సీరధ్వజ జనక మహారాజ వర్మణః పుత్రీం
శ్రీ సీతా మహాలక్ష్మినామ్నీం కన్యాం

శ్రీ వేంకటేశ్వర : ఆంగీరస - బార్హస్పత్య - భారద్వాజ సగోత్రోధ్భవస్య -
పరబ్రహ్మణః శరణ్యో నప్త్రే
నారాయణ వర్మణః పౌత్రాయ
ప్రద్యుమ్న శర్మణః పుత్రాయ
శ్రీవేంకటేశ నామధేయో వరాయ

శ్రీ లక్ష్మి : సౌభాగ్య, విశ్వంభర, నిరాకార సాకార త్రయార్షేయ ప్రవరాన్విత సౌభాగ్య,
సగోత్రోద్భవస్య.
విశ్వంభర శర్మణో నప్త్రీం
రత్నాకర శర్మణః పౌత్రీం

క్షీర సాగర శర్మణః పుత్రీం
శ్రీమహాలక్ష్మీనామ్నీం కన్యాం

శ్రీ వేణుగోపాల; అంగీరస; అయాస్య, గార్గసైన్య; త్రయార్షేయ ప్రవరాన్విత గార్గేయ సగోత్రం
యదు వర్మణో నప్త్రే
శూరసేన వర్మణః పౌత్రాయ
వసుదేవ వర్మణః పుత్రాయ
శ్రీవేణుగోపాల (కృష్ణ) నామధేయోవరాయ

శ్రీ రుక్మిణీ : సౌభాగ్య, విశ్వంభర, నిరాకార – సాకార త్రయార్షేయ ప్రవరాన్విత సౌభాగ్య సగోత్రం
మహాభీష్మక వర్మణః నప్త్రీం
భీమ వర్మణః పౌత్రీం
భీష్మకరాజ వర్మణః పుత్రీం
శ్రీరుక్మిణీ నామ్నీం కన్యాం

సత్యభామ : సౌభాగ్య సగోత్రం యుధాజిత్, క్రతుజిత్, సాత్రాజిత్

## ❋ షడ్ బేరాణి ❋

### శ్రీ ప్రశ్న సంహితాయామ్ త్రయోదశాఽధ్యాయే

ప్ర : విగ్రహములు ఎన్ని రకములు ?

స : శ్రీ భగవాన్।

శ్లో॥ కర్మార్చాది విశేషాణామ్ సంజ్ఞాభేదంచ లక్షణమ్।
ఉపయోగ్యస్తథైతేషామ్ కథ్యతే కమలేక్షణే।
కర్మార్చా చోత్సవార్చాచ బల్యర్చా తథాపరే।
తీర్థ స్నానో స్యాతా మపరా శయనార్చికా.। (౧; ౨)

(1) కర్మార్చ; (2) ఉత్సవ; (3) బలి; (4) తీర్థ; (5) స్నాన; (6) శయన బేరములు.



## ❋ పంచగవ్య ప్రాశనమ్ ❋

శ్లో॥ యత్వగస్థి గతం పాపం దేహే తిష్ఠతి మామకే।
ప్రాశనాత్పంచ గవ్యస్య, దహత్యగ్ని రివేంధనమ్।

ఆవుపాలు – పెరుగు – నేయి – మూత్రము – మలము ఈ ఐదునూ పంచ గవ్యములు అందురు. వీనిని కలిపి త్రాగినచో అగ్ని అన్నిటినీ దహించినట్లుగా – దేహగతపాపములన్నియు సమూలముగా – నశించును.

## ❋ ద్వార తోరణములు ❋

శ్రీ విష్ణు తిలకే :

శ్లో॥ అశ్వత్థ తోరణమ్ ప్రాచ్యామ్। యామ్యా మౌదుంబరం విదుః।
నైయగ్రోధం పశ్చిమా స్యామ్। సౌమ్యే ప్లాక్షమ్ (శృతుర్ముఖ)।

తా॥ రావియాకుల తోరణము తూర్పునను; మేడియాకుల తోరణము దక్షిణమునను; మర్రియాకుల తోరణము పడమర యందుననూ; జువ్వియాకుల తోరణము ఉత్తరముననూ యాగ మండపమునకు కట్టవలెను.

## ❋ పరమ భాగవతులు ❋

శ్లో॥ ప్రహ్లాద – నారద – పరాశర – పుండరీక।
వ్యాసాఽంబరీష – శుక – శౌనక – భీష్మ – దాల్భ్యాన్।
రుక్మాంగదాఽర్జున – బలి – విభీషణాదీన్।
పుణ్యానిమాన్ పరమ భాగవతాన్ స్మరామి।

## ❋ స్వామిని దర్శించుట ❋

స్వామిని పాదములనుండి –కిరీటము వరకును దర్శించిన ఊర్ధ్వ (విష్ణు) లోక వాసులగుదురు పైనుండి క్రిందికి (తల నుండి – పాదముల వరకు) చూచిన పాతకము సంభవించును.

★ ఆలయమున భగవద్ విషయములప్ప ఇతర విషయములు మాటాడరాదు.

